# జైమినిభారతము

రచయిత:

తర్కాచార్య, భాషాప్రవీణ
శ్రీ కంభంపాటి రామగోపాలకృష్ణమూర్తి




ఉమా పబ్లిషర్సు, విజయవాడ-1.

# ప రి చ య ము

జైమిని భారతమును పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి వ్రాసెను. నతడు మహామహిమాన్వితుడు 'వాణి నారాణి' అని మెప్పించిన ధీరుడు. బ్రహ్మచారి. ఇతనికవిత సులలితము. జైమినిమహర్షి జనమేజయునితో చెప్పినందున దీనికి 'జైమిని భారత' మని పేరువచ్చినది. అందశ్వమేధపర్వము మాత్రమే మిగిలియున్నది. తక్కినది శిథిలమనితలంతుము. దీనిలో ధర్మరాజాశ్వమేధము చేయుటయే ముఖ్యకథ. కాన దీని కశ్వమేధ పర్వమని పేరు.

ఈకవి దీనిని సాళువ నరసింహానాయకుని కంకితమిచ్చెను. అతడు విజయనగరము నేలినవాడు. మంచి పరాక్రమశాలి. అతనియాదరణతో ఈ పురాణము ప్రబంధముకాగా, మా ప్రకాశకుల చేయూతతో నే దీనిని వచనముగా నంతరించితిని. బాలురు దీని జదివి ప్రబంధము నాస్వాదింప గోరుదురుగాక! విద్యావంతులు మా కృషికి చేదోడునిత్తురని ప్రార్థించుచున్నాను.

శా. శ. 1879 జ్యేష్ఠము 15
విజయవాడ-2.

ఇట్లు,
ర చ యి త

ఇందు...

భీము డశ్వమేధహయమును తెచ్చుట
అనుసాళ్వుని జయించుట
నీలధ్వజుని జయించుట
నీలధ్వజుని కగ్నిహోత్రుడల్లుడగుట
అర్జునునికి గంగాశాపము
ఉద్దాలక చరిత్ర
హంసధ్వజునితో యుద్ధము
సుధన్వుని ధర్మతత్పరత
సురథుని వృత్తాంతము
ప్రమీలార్జున యుద్ధము
బభ్రువాహన విజయము
తామ్రధ్వజునితో యుద్ధము
మయూరధ్వజుడు శరీరమునుకోసి దానమిచ్చుట
చంద్రహాసుని చరిత్ర
ధర్మరాజు అశ్వమేధముచేయుట

... చదువనగును.

# జైమిని భారతము

జనమేజయ చక్రవర్తి పరీక్షిత్తు కొడుకు. అభిమన్యుని మనుమడు. అభిమన్యుడు అర్జునుని కొడుకని అందరికి తెలిసిందే. ఆ జనమేజయుడు సర్పయాగము చేసెను. తరువాత కొన్నాళ్ళకు వైష్ణవ యాగము సక్రమముగా పూర్తిచేసి సుఖముగా ఉండగా ఒకనాడు జైమినిమహర్షి అతనికడకు వచ్చెను. అప్పు డతడా ముని కర్ఘ్య పాద్యాదు లిచ్చి పూజించి తన తాతలకు జరిగిన యుద్ధము మొదలైన కథలను చెప్పుమని కోరెను. ఆ మహర్షి 'అవి చెప్పినందుకు కలి దోషములు పోవు' నని చెప్పి భారతయుద్ధ కథ నంతయు చెప్పెను. అంత చక్రవర్తి 'మహాత్మా! పదునెనిమిది రోజులు మహా భారత సంగ్రామము చేసినతరువాత ధర్మరాజు అశ్వమేథము చేసెనని విన్నాను. దాని కథను సవిస్తరముగా చెప్పు' డని ప్రార్థించెను. అతడు చెప్ప దొడగెను.

భారత యుద్ధానంతరము ధర్మరాజు పట్టాభిషిక్తుడైనాడు. అతనికి రాజ్యముమీదకంటె ధర్మముమీద ఆసక్తి యెక్కువ. అందుచేత అంపశయ్యమీదనున్న భీష్మునివారి వద్దకు వెళ్ళి ఎన్నో ధర్మ సంశయములు తీర్చుకొనినాడు. ఇంతలో ఉత్తరాయణము వచ్చినది. ఆయన స్వచ్ఛందముగా పరమపదించినాడు. అప్పుడిక తనకు ధర్మకథల చెప్పువా రెవ్వరును లేరు. సద్గోష్ఠిలేనందున ఒక్కసారి తాము చేసిన

యుద్ధకథ అంతయు జ్ఞాపకము రాగా 'అయ్యో! ఈ రాజ్యమునకై ఎందరు బంధువులను, రాజులను చంపినాము. ఈ మహాపాతకము నన్ను వదలునా?' అని విచారముతో ఏమియు తోచక కూర్చుండెను. ఇంతలో వ్యాసమహర్షి అచ్చటికి వచ్చినారు. ధర్మరాజునకు సగము ప్రాణము లేచి వచ్చినది. ఆయనకు నమస్కరించినారు. ఆ మహర్షియే భారతమురచించినాడు. భారత మొక్కటేకాదు. పదునెనిమిది మహాపురాణములు కూడ అతడే రచించినాడు. కొందరికి అనుమానము 'ఒకడే ఇన్ని పుస్తకాలు వ్రాయగలడా? మనకు చదువుటకే జీవితము చాలదే?' అని. వారిబ్రదుకంతే. తమశక్తితో అందరిశక్తిని కొలవవచ్చునా? ఒక్కొక్కడు వందకాదు, వెయ్యిసార్లు చదివినను ఒక్కపద్యమైనను రాదు. చూడుడు: ఎందరు శతావధానులు మన దేశములోఉన్నారు? వీరిదృష్ట్యా వారినికూడ చూచినచో మన తెలివితేటలకు మనమే సంతోషించుకొనవలె.

వ్యాసమహర్షి కపరిమితమైన భక్తితో పూజలుచేసి ఉచితాసనముమీద కూర్చుండబెట్టి మిక్కిలి విచారముతో 'వ్యాసమహర్షీ! నే నెంతో మహాపాపిని. నా అంతపాతకము చేసినవా డెవడైన నుండునా? నా చేసిన పాతకమునకు నిష్కృతి (పోవు విధానము) ఉన్నదా? భీష్మద్రోణులను, పూజ్యులను నా పొట్టను పెట్టుకున్నానుగదా! ఈ రాజ్యకాంక్ష న న్నింత చేసినది. ఆ కర్ణుడు - దానకర్ణుడు - దానములు చేయుచుండగా ఎందరెందరో దానములు తీసికొని

అతనిని పొగడుచుండగా ఆ పొగడ్తలు మిన్నుముట్టినవి. వారికి సంతోషముతో కన్నులవెంబడి ఆనందబాష్పములు వరద లయ్యేడివి. ఇక నా రాజ్యములోనో? ఏమూల చూచి నను 'నా బంధువులు చనిపోయిరి. నా బంధువులు చనిపోయి' రని ఏడుపులు, శోకములే కదా! ఎందు కీ రాజ్యము నాకు? పెద్దలను రక్షించుట లేకపోగా, అన్యాయముగాకూడ చంపి నామే. ఇక నాకీరాజ్యముమీద ఆశలేదు. భీమునికి పట్టముగట్టి, నే నడవికిపోయి నియమనిష్ఠలతో తపస్సు చేసి కొందును ఆ వ్రతములు, జపములు, తపస్సులు అయిన నా పాతకములను పోగొట్టునేమో?' అని ఇంకను దీనవదను డయ్యేను.

పెద్దవా రందువలననే ఉండవలె నందురు. మన కేదై నను బాధకల్గినప్పుడు పెద్దల నడిగిన కొంత ఉపశాంతి అగు చుండును. వ్యాసమహర్షిమీద పడిన దాతని నూరడించే బాధ్యత. వ్యాసమహర్షి దయార్ద్రదృష్టులుబరపి 'నాయనా! ధర్మరాజా! నీ వేమియు వాడలవద్దు. ఇదొక పెద్ద పాతకము కాదు. ఒక్క అశ్వమేధయాగము చేయుదువా, పాతకము లన్నియుకూడ పటాపంచలై పోవును. శ్రీరామచంద్రుడు అశ్వమేధయాగముచేసియేకదా రావణాసురుని చంపిన పాత కమును పరిహరించుకొన్నాడు! అట్లే నీవుకూడ అశ్వమేధ ము చేయుము. పాతక మను శంకయే ఉండదు' అనుటతో కొంత ధైర్యము చిక్కినది. కానియజ్ఞముచేయుటకు డబ్బేదీ? ధనములేనివా డేమి చేయగలడు? పోనీ, ప్రజలమీద వసూలు

చేయుదమన్న నిన్నగాక మొన్న యుద్ధముపేరుచెప్పి ప్రజలను కూకటివేళ్ళతోసహా చంపి, ఈరోజున పన్నులిమ్మని ఒత్తిడి చేసిన గోరుచుట్టుపై రోకటిపోటు' కాదా! వారందరు నన్ను తిట్టిపొయ్యరా? అందుచేత అశ్వమేధ మెట్లుచేయగలనో? నాకేమియు తెలియుటలేదు. అనుటతో వ్యాసుడునవ్వుచు 'డబ్బునకై పెద్దబాధపడనక్కరలేదు, ఇదివరలో మరుత్తభూపతి బ్రాహ్మణులకెన్నో సువర్ణ రాసులు దానము సేయగా వారుతీసుకొని వెళ్ళలేక దిగబెట్టిరి. అది హిమాలయములదగ్గరగా రాసులుపడి యున్నది. అది తెచ్చుకొమ్ము' అనుటతో ధర్మరాజు 'సరి! మీరు చెప్పినది చాల బాగున్నది, అసలే బంధువుల చంపిన పాపమునకై యజ్ఞము తలపెట్టగా పై పెచ్చు బ్రాహ్మణ ద్రవ్యము అపహరింపుమందువా? ఇదా న్యాయమా? నేను యజ్ఞమేచేయను' అనెను. అది విని వ్యాసుడు ఓం! ఎంత ధర్మమూర్తివి! ధర్మము నీకేగాని నాకు తెలియదా! ఆమాటకు వచ్చిన ఈ భూమిఅంతయు కశ్యపునిది కాదా? దానిని నీవు పరిపాలించుట లేదా? ఆ బ్రాహ్మణులు విడిచివెళ్ళిన ధనము రాజులకే చెల్లును. అధికారిలేనిసొత్తునకు రాజే అధికారి. నీవు రాజువుకదా! న్యాయముగానే అది నీకు చెల్లును. కావున సంశయింపక ఆ ధనరాసుల తెప్పించుము. ఇక అశ్వమేధముచేయు విధానము చెప్పెదను వినుము. దానిని చేయించుటకు ఇరువదివేలమంది బ్రాహ్మణులు కావలెను. అశ్వమేధ హయమును విడచు రోజున ఋత్విక్కులకొక్కొక్కనికి ఒక యేనుగు, ఒకగుర్రము, ఒకరథము, నవరత్నములు దక్షిణగా నీయవలెను. అశ్వమేధమునకు మామూలు గుర్రములు పనికి

రావు శరీరమంతయు తెల్లగాఉండి, తోక చెవులు నల్లగా ఉండి మంచివేగముకలిగిన ఉత్తమజాతి గుఱ్ఱము కావలెను. అభావే పక్షములో ఏదైననుసరే. దానిఫలితముకూడ అట్లే ఉండును. దానిని చైత్ర శుద్ధ పూర్ణిమనాడు విధివిధానముగా పూజించి ఏడాది ఇష్టమువచ్చినట్లు తిరుగుటకై వదలవలెను. దాని ముఖముమీద 'ఏవరైనను శూరు లున్నచో పట్టు కొనుడు' అని బంగారుపతకముమీద వ్రాసి కట్టవలెను. అట్లది తిరిగివచ్చువరకు యజ్ఞకర్త దీక్షపూని బ్రహ్మచర్య ముతో నియమముగా నుండవలెను. అట్లు బ్రహ్మచర్యము నొక్క భీష్ముడుతప్ప ఎవరును పాటింపలేకపోయిరి. నీవు మాత్రము నియమమును జాగ్రత్తగా పాటింపుము' అని చెప్పెను.

అది విని ధర్మరాజు 'ఇప్పు డెవరిని పంపుదును. అంద రును యుద్ధములో అలసియున్నారు. వృషకేతనుడు [కర్ణుని కొడుకు] కుఱ్ఱవాడు. మేఘవర్ణుడు తన తండ్రియైన ఘటో త్కచుడు మానిమిత్తమై యుద్ధములో చనిపోవుటచే విచార ముగా ఉన్నాడు. ఇంకెవరిని అశ్వమేధహయమును తెమ్మని పంపుదును?' అనిన విని భీముడు లేచి 'అన్నా! నీకింత బెంగ ఎందులకు? మనము ఏ కృష్ణభగవానుని దయవలన భారత సంగ్రామసముద్రము నీదగల్గితిమో అట్టిభగవానుడు మన పాలిటనుండగా మన కేమికొదువ? నిజమున కాతనియనుజ్ఞపై యుద్ధమంతయు జరిగినది; కనుక దానిదోషము వీసమైనను మనకు కలుగదు. అయినను లోకులు మెచ్చుటకై యజ్ఞము

చేయుము. నే నొక్కడనే వెళ్ళి గుఱ్ఱమును తెత్తును' అని హెచ్చరించెను. ఆమాటలు ధైర్యముచూచి వ్యాసమహర్షి 'ధర్మనందనా! భీముడు పట్టుపట్టినతర్వాత కార్యసాధనకు సంశయములేదు. నేను చెప్పిన లక్షణములు కల గుఱ్ఱము యౌవనాశ్వునివద్ద నున్నది. అతని రాజధాని భద్రావతీపట్టణము అతడు గుఱ్ఱమున కెంతయో కట్టుదిట్టములు చేసియున్నాడు. పది అక్షౌహిణుల సేనను దానికి కావలియుంచినాడు. ఆదిగదా మనకు దక్కినచో ఇక అడ్డేమున్నది? కార్యము నెరవేరినట్లే అనగానే భీముడు 'పది అక్షౌహిణులు కాదు, పదునాలుగు లోకములవారు కావలియున్నను లెక్కలేదు. నేను వెళ్ళి వత్తును. అట్లు తేలేనిచో పంచమహాపాతకములు నన్నంటుగాక! శ్రీకృష్ణు డండగా ఉండగా విజయమేల సిద్ధింపదు?' అనెను. ధర్మరాజదివిని నాయనా' భీమసేనా! నీవెప్పుడునింతే. విసురు, ఆవేశము. అంతకంగారేమి వచ్చినది? అందరిని నీవుకొట్టగలవనుకో. అయినను కొంచెము వెనుక నెవరైన ఆసరా ఉండుట మంచిదికదా! ఎవరిని పంపుదుము!' అనుట విని వృషకేతనుడు నేను వెళ్ళెదను. ధర్మజా! అనుజ్ఞ యిమ్ము, అనెను. భీమున కామాటల కెంతో దుఃఖమువచ్చి 'కుమారా! నీ తండ్రిని మేము చేతులారా యుద్ధములో చంపినాము. నీవు మాకు సహాయము చేయుదునందువు కాని నీమొగము చూచుసరికి నాకు దుఃఖము పొంగి పొంగి వచ్చును. ఏమిచేయుదును? 'అనుటతో అతడు, అట్లనకుడు. ధర్మమూర్తియైన శ్రీకృష్ణునిపక్ష మవలంబింపక దుర్యోధను నాశ్రయించినందుకు నాతండ్రి తగిన శిక్షనంది

నాడు. అతని కట్లు కావలసినదే. నా కండ్లకు సంతోషమే కాని విచారమేమియును లేదు. అని ప్రోత్సహించెను. అంద సంతోషముతో భీముడు మేఘవర్ణుని కౌగిలించుకొని 'నాయనా! నీతండ్రి మా కెంతో సేవజేసినాడు, నీవుకూడ నేను నచ్చువరకు ధర్మరాజును సేవించుచుండుము' అనెను. అంత నతడు 'తాతా! నీవు చెప్పునది కాదు. నేను నీ పాదసేవ చేయగోరుదును. నాకు అనుమతి నిప్పింపుడు' అని వేడెను. దానికి భీము డెంతో ఆనందించి నా మనుమడ వనిపించు కొన్నావు. మనము ముగ్గురము కలిసిన ఇక మాకు లోకములో తిరుగులేదు అనెను. అందరును సంతసించిరి.

అప్పటికి ప్రొద్దుగ్రుంకినది. అందరును సంధ్యానార్చు కొనుటకు లేచినారు. సంధ్యావందనము వేళకు వ్యాసుడు వెళ్ళిపోదలంచెను. అ దెరిగి ధర్మజాదులు వ్యాసమహర్షికి వందనము చేసి సాగనంపిరి. మిగిలినవారి సంధ్యలు భోజనములు పూర్తిఅయినవి. భోజనము చేయుచున్నంత సేపు ధర్మరాజు దృష్టి యజ్ఞముమీాదనే ఉన్నది. మునివచ్చి లఘూపాయ ముగా యజ్ఞము చేయమన్నాడు. అది అనుకొన్నంత తేలిక యైన పని కాదు. ఎల్లా నిర్వహించునది? శ్రీకృష్ణుడు దగ్గర లేడే. అతడువచ్చిన బాగుండును అనుకొనుచుండెను.

ఆ అనుకొనుటయే కృష్ణునికి వైర్ లెస్ (నిస్తంతీవార్త) లాగున అందినది, కష్టసమయములో నేకదా తాను కావలసి వచ్చుట. ఇప్పుడును తాను వెళ్ళకపోయిన 'అక్కరకురాని చుట్టము' అయిపోవును. అది సాంప్రదాయములోనిదే కాదు.

వెంటనే వచ్చి కోటముందు వ్రాలినాడు. ద్వారపాలకులు నమస్కారములు చేసిరి. కృష్ణు డిట్లు వ్రాలుట వా రదివ కెన్నోసార్లు చూచినందున అది వారికి క్రొత్తకాదు; ఆశ్చర్య మునుకాదు. కృష్ణుడు ధర్మరాజుతో తాను వచ్చినవార్త చెప్పు మన్నాడు. మహారాజు లిళ్ళలోనికి కబురుపంపకుండ వెళ్ళరా దుకదా! అన్నాడు. ఏలకో? అంత ద్వారపాలకులు తలలువంచి చేతులు జోడించి అయ్యా! తమరట్లు సెలవియ్యరాదు. అం దరి విషయము అంతేకాని, మీకు ప్రత్యేకత ఉన్నది. మీ రెప్పుడు వచ్చినను వెంటనే లోపలికి ప్రవేశపెట్టుడు అని రాజాజ్ఞ. కనుక లోనికి దయచేయుడు అనిరి. శ్రీకృష్ణుడుసంతో షించి లోపలికి వెళ్లెను. అక్కడ నలుగురుకలిసి ఆలోచించు చున్నారు. కార్యసాధననుగూర్చి తేలుటలేదు కృష్ణుని చూచుసరికి ధర్మరాజు బ్రహ్మానందపడి 'వచ్చితివా తండ్రీ! అనుచు ఎదురుగావచ్చి మర్యాదచేసెను కృష్ణుడు 'నీవు పెద్ద వాడవు' అని అతనికి నమస్కరించెను. అత డితనిని కౌగి లించుకొనెను. తక్కినవారు కృష్ణునకు నమస్కరించిరి. అం దరిని లేవనెత్తి తగుకీతిని పలుకరించెను.

అంత ధర్మరాజు శ్రీకృష్ణా! నీవు లేకుండ మాకే అవ సరములు తీరుచున్నవి? నీకరుణాకటాక్షప్రసారముల చేతనే మేము ఈ రూపమున నిలువబడగలిగినాము. ఇప్పు డీ యజ్ఞ సమస్యకూడ నీవే తీర్చవలెను. 'అన్యథా శరణం నాస్తి' అని ప్రార్థించి జరిగినసంగతినంతయు చెప్పెను. అదివిని శ్రీకృష్ణుడు నవ్వుచు భీముడే గదపట్టిసాధింపదలచినప్పు డికలో టేమి

న్నది? అత డేమి సామాన్యమానవుడా? తెలివి తేటలు, ఆలోచనాశక్తియు తక్కువైనను తిండి ఎక్కువే! పెద్దబొజ్జ నిము రుకొనుచుండు అలవాటు. రాక్షసస్త్రీలతో కాపురము చేయు నంతటి మహాబలిశాలి. నోరువిప్పెనా? పెళపెళలేకదా! మృదువుగా మధురముగా మాట్లాడుట అన్నది ఎరుగనే ఎరుగడు. ఆహాహా! ఈతడా పని సాధించువాడు? వేదికి వేదికి చక్కనివానిమీద కార్యభారము వేసినావు?' అని పరిహాసము చేయుచు భీముని కేసి తిరిగి 'భీముడు బావా! నీ వనుకొనినంత తేలిక అనుకొంటివే, అశ్వమును తెచ్చుట! హిడింబుడు, బకాసురుడు, జరాసంధుడు కాదు మోటుయుద్ధము చేయుటకు, అందరు అట్లే సులువు తెలియనివారనుకొందువా? ఆ నాడు అర్జునుడు సైంధవునిచంపెదనని ప్రతిజ్ఞపూనినాడు; అది నెర వేర్పచేయుటకు నా యోవచ్ఛక్తి వినియోగింపవలసివచ్చి నది. ఈనాడు నీవుపట్టినావు ప్రతిజ్ఞ. ప్రతిజ్ఞలకేమి?మాటలేగా. మాటలకేమి లోటు? వదరవచ్చును' అనెను.

భీము డందులకు కోపగించక 'బావగారా? నన్నాక్షే పించువారు? నీకు పాపము, బొజ్జ చిన్నది; పదునాలుగు లోకాలు పెట్టుకున్నను కావలసినంతచోటుండును. రాక్షస స్త్రీలను నీ వే మెరుగుదువు? బృందావనమునే కాని. నీ బుద్ధిమత్తకు నరసింహావతారమే సాక్షి. తిండిపోతుతనమా గోపికలకే ఎరుక. నే నేమి చెప్పను? ఎందుకు వచ్చిన పరిహాసములు? నిన్ను మనసార ధ్యానించినంతకాలము నా కష్టులేదు. కొండలు పెకలించుమందువా? దిగ్గజములను

మూటకట్టి తెమ్మందువా? ఏమి జేయుమందువు!' అనుటతో శ్రీకృష్ణుడు సంతోషించి బావగారికీ వేళ కోపమురాలేదు. కార్యసాధకులైనారు కాబోలు!' అనుచు భీముని కౌగిలించు కొనెను. 'సాధించి అశ్వమును తెచ్చి యజ్ఞము కొనసాగింపుము' అనుటతో భీముడు నమస్కరించి 'కృష్ణా! నీచేతులలో పెట్టినది కోటిఫల మిచ్చును. యుద్ధము నీ చేతులార పూర్తిచేయించితివికదా! ఇప్పుడీ యజ్ఞమును కూడ నీవే నెరవేర్చవలెను' అని కోరెను. శ్రీకృష్ణు డట్లనే సెలవిచ్చెను.

అంతలో వంట యైనది. భోజనసమయము మించుచున్న దని ద్రౌపది చెప్పెను. అందరును స్నానములు చేసి భుజించిరి. అప్పుడు సుఖశయనము చేసిరి. తెల్లవారుటతో మేల్కాంచి నిత్యకృత్యముల దీర్చుకొని సభకు విచ్చేసినారు. అందులో భీమసేన, మేఘవర్ణ, వృషకేతులు యుద్ధసన్నాహముతో వచ్చి ధర్మరాజుపాదము లంటి నమస్కరించిరి. శ్రీకృష్ణునకు నమస్కరించి సెలవుతీసికొని ప్రయాణమైరి.

శరవేగముతో ప్రయాణము సాగించి భద్రావతికి పొలిమేరలో ఉన్న పర్వతముమీదికి చేరిరి. అచ్చట ఒక దిగుడు బావి కలదు. అది చాల మనోహరముగా ఉన్నది. దాని గట్టున గుఱ్ఱపు డెక్కలు కన్పడుచున్నవి. అదంతయుచూచి 'ఇదే ఆ గుఱ్ఱము నీరు త్రాగెడి చెరువై యుండవచ్చును. మనకు కావలసినది గుఱ్ఱముకదా! ఇక్కడికి రాగానే త్రోలుకొనిపోదము. పది అక్షౌహిణులసేన కావలియుండు సన్నాహ రే.

కాని. నీవు త్రాగినన్నీళ్ళకొరకే అంత ఉంటుందా? కొంతయే వచ్చిన మనము దానిని హతమార్చి గుర్రమును పట్టుకొని పోవుదము' అని నిర్ణయించుకొని అక్కడనే చాటుగా ఒక పొదరింటిలో దాగికొనిరి.

అంతలో సేనవచ్చు చప్పుడైనది. చతురంగ బలముతో యౌవనాశ్వుని సేనాపతి గుర్రమును నీరు త్రాగించుటకై తీసికొని వచ్చుచుండెను. ఆ సేన మధ్యలో చుక్కలలో చంద్రునివలె ప్రకాశించుచున్నది యజ్ఞాశ్వము. దానిని చూచి 'అదిగో మన కోరిన గుర్రము. ఇక మనకు వారితో యుద్ధము అక్కరలేదు. దీని నేదోరీతిగా తరలించుకొనిపోయిన చాలు'నని భీము డనగా మేఘవర్ణుడు 'తాతా! నా ప్రతాపము చూడుము. ఒక్కసారిగా శంబరీ మాయలు చూపి వీరిని మోహపెట్టి గుర్రమును తెచ్చెదను' అని ఏమి మంత్రము పెట్టెనో అప్పటివరకు ఎండకాయుచు, మబ్బు తునకయైనను లేని ఆకాశమంతయు మబ్బులతో ఆవరించుకొనిపోయినది. అంతలో అదంతయు అంధకార బంధురమైనది. మధ్యమధ్య మెరుపులతో కన్నులు చీకట్లు క్రమ్ముచున్నవి. సైనికులకేమియు అర్థముకాలేదు వారు తబ్బిబ్బుపడుచుండిరి. ఇదంతయుచూచి ఇంద్రుడు 'ఎవరో రాక్షసుడు మాయలు చేయుచున్నాడు. చూచిరమ్మ'ని భటుని పంపెను. అతడు వచ్చి మేఘవర్ణుని చూచి 'ఇదేమిటి? నీ వెవరు, పేరు ఏమి? ఇంద్రుడు తెలిసికొని రమ్మనినాడు అనగానే అతడు 'నేను భీమునిపుత్రుడైన ఘటోత్కచుని పుత్రుడను

మేఘవర్ణుడునా పేరు ధర్మరాజునకశ్వమేధాశ్వమును దీసికొని వెళ్లుటకై వచ్చినారము. దానికై యీ సంరంభము కాని, అంతకంటె ప్రమాదమేమియు లేదనిచెప్పి అతనిని పంపి, తాను యథాపూర్వముగా మాయలు చేయుచుండెను. సైనికుల కది అగమ్యగోచరమైయుండగా మేఘవర్ణుడు మధ్య కువచ్చి గుర్రము నెత్తుకొనిపోయెను.

అది చూచి కొందరాతనిని కొట్టబోయిరి. కాని, వారిని అణచివేసి, అతడు గుర్రమును కొండమీదికి తీసికొనివెళ్ళి భీమునిముందర ఉంచెను. అత డెంతో సంతోషించెను.

ఇంతలో యౌవనాశ్వుని సైన్యమంతయు వీరులపైకి రాబోగా వారినందరిని మేఘవర్ణుడు మధ్యేమార్గముననే చంపివేసెను. హతశేషు డొక్కడు నగరములోనికి వెళ్ళి మహారాజునకావార్తనందించెను. అతడు 'వారిసైన్య మెంతఉన్నది? మిమ్ములనందరిని హతమార్చినారే' అని అడుగగా, ఆవచ్చిన సైనికుడు 'సైన్య మొకటియా? ఉన్నవారు ముగ్గురు. అం దొక్కడే మనసైన్యములోనికివచ్చి, గుర్రమునెత్తుకొని పోయి కొండపై పెట్టి తిరిగి మమ్ములను సదమదముచేసెను' అనుటతో మహారాజు ఆశ్చర్యపడి 'అయినచో వారెవరో త్రిమూర్తులై యుందురు. కాని సామాన్యమానవుల కింత శక్తి యెక్కడిది?' అని తాను బలముల నెక్కువగా కూర్చుకొని యుద్ధమునకువెళ్ళి వారి నెదుర్కొనెను. అప్పుడు యుద్ధమున కు వృష కేతుడు వచ్చెను.

అతడు పైకిచూచుటకు కుఱ్ఱవాడేకాని శౌర్యసాహసము లెక్కువ. ముఖమున క్షాత్రతేజస్సు తాండవమాడుచున్నది. అతనినిచూచి యౌవనాస్యుడు 'నాయనా! నీ వెవరవు? నీతో వచ్చిన ఆ యిద్దరు నెవరు?' అని యడుగగా అతడు తమజాతినామములచెప్పెను. అది విని రాజు 'మీవంశ విశేష మట్టిది. బాగున్నది. కాని నీవు నాతో యుద్ధముచేయగలవా? కాక నీకు వాహనమేమియులేదాయె నారథమునొకదానిని పుచ్చుకొనుము. యుద్ధము చేయుదువుగాని' అనుటతో వృషకేతుడు 'ఎంతమాటన్నారు? నాతండ్రిఇచ్చుటయే కాని పుచ్చుకొనుటయెరుగని దాదవీరుడు. అట్టివానికొడుకునై నేను మీవద్ద రథము పుచ్చుకుందునా? కాక ఇచ్చి పుచ్చుకొనుట కల్గుటతో సఖ్యమేర్పడును. అప్పుడుమీతోయుద్ధము చేయు టెట్లు? అది ధర్మమా? నా కేమియు నక్కరలేదు. సేనస్సును సిద్ధముచేసికొమ్మని పురికొల్పి తాను విల్లును ప్రమోయించెను. రాజుకూడ వింటినెక్కుపెట్టి బాణములు వదల నారంభించెను. కాని అవి వృషకేతునికి తగులుటలేదు. దారిలోనే అతని బాణములకు గురియై ముక్కలైపోవుచుండెడివి. ఎంతసేనవచ్చినను అడ్డులేకుండ తిరుగులేకుండ శరవర్షమును కురిపించుచుండెను. అదిచూచి సైనికులందరును ముందుకు వెళ్ళలేక పారిపోజొచ్చిరి. అంత రాజు కోపించి ఒక్కసారి గట్టిగా వృషకేతునితో యుద్ధమారంభించెను ఒకఅస్త్రప్రయోగముతో వృషకేతుడు మూర్ఛిలెను.

అప్పుడు భీముడు ప్రళయకాలభీముడై వృషకేతుని మూర్ఛపొందించిన ఇతనిని, ఇతని సేనలను బయటపడనిత్తువా?

చూడుడు నా ప్రతాపము అని తన గదను త్రిప్పుచు యౌవ నాశ్వుని సేనలపై కురికెను ఆ సేనలన్నిటిని తుత్తునియలు చేయుచుండెను. తాను చంపిన బలగమును తనతండ్రికి చూపు చున్నట్లు పై కెగురవేయుచుండెను. అవెక్కడకు పోయెడివో కాని మరల తిరిగివచ్చుటలేదు. అతని తాకిడికి సైన్యమెల్ల చెల్లాచెదరై పోయెను. అంత సువేగు డను యౌవనాశ్వుని కుమారుడు ముందుకువచ్చి భీమునితో కలియబడెను. కొంత సేపు గదాయుద్ధము చేసిరి. అంతటితో తనివితీరక ద్వంద్వ యుద్ధము చేయుచుండిరి. అది చూచివారికి భయము ఆశ్చర్యము వేయుచుండెను. ఆబోతు ఆబోతును, ఏనుగు ఏనుగును డీకొన్నట్లు వా రిరువురు నొకరినొకరు తీసిపోక పోరుచుండిరి.

ఇంతలోపల వృషకేతుకుమారు్చతేరి, యౌవనాశ్వుని పై అస్త్రప్రయోగ మారంభించెను, అటు వా రిరువురు శస్త్రాస్త్రజాలములతో పోను సల్పుచుండిరి. అందు వృష కేతుని అస్త్రముల దెబ్బకు తట్టుకొనలేక యౌవనాశ్వుడు క్రిందపడెను. వెంటనే వృషకేతుడు వెళ్ళి అతనికి ఉపచార ములు చేసెను, అది ధర్మయుద్ధము. ఇద్దరును సిద్ధమై యున్నంతసేపేకాని, ఆపైన చే యెత్తరు సరికదా, వారి కుపచారములు చేయుదురు. కొంతసేపటికి రాజు తెప్పరిల్లెను. అంత మరల వృషకేతుడు విల్లు నెక్కుపెట్టుచుండ యౌవ నాశ్వుడు విచారించి 'నాయనా! నీవు తండ్రికి తగిన పుత్రుడవు, వీరుడవు. నన్ను గెల్చితివి. గెల్చుటయేకాదు;

ప్రాణదానము చేసితివి. ప్రాణదానముచేసిన నీతో తల పడనా? నాకది యుక్తమని తోచదు నా రాజ్యమంతయు నీ యధీనము ఇక నీ యిష్టమువచ్చినట్లు వాడుకొనుము' అనుటతో సైనికులందరు అక్కడకు వచ్చిరి. భీము సువేగులు యుద్ధము చాలించి వచ్చిరి. వృషకేతుడు 'మాకు మీ రాజ్యము అవసరములేదు. ఈ యజ్ఞాశ్వము నిచ్చిన చాలును. మా లక్ష్య మది యొక్కటియే' అనుటతో భీము డా మాటల కెంతో సంతోషించి, అతడు చెప్పినట్లే చేయుమనెను. యౌవనాశ్వుడు 'మీరు ముగ్గురు మా ఇంటికి వచ్చి మేమిచ్చు ఆతిథ్యము స్వీకరించి వెళ్ళుటకు కోరు చున్నాను. నాకోరిక తీర్చవలెను' అని ఏనుగులపై వారి ముగ్గురిని పట్టణములోనికి తీసికొని వెళ్లెను. ఆనగరములోని వారెల్లరు వారిని చూచి వింతపడిరి. ఎంత బలశాలురు. లెక్కకు ముగ్గురు; కాని మూడులోకములవా రొక్కనా రెత్తివచ్చినను ఆపగలరు అనుకొనుచు, వారిని వేనోళ్ళ పొగడుచు హారతు లిచ్చిరి. యౌవనాశ్వుడు తన కోటలోనికి తీసికొని వెళ్ళి వారికి రాజమర్యాదలు చేసెను. దివ్యముగా భోజనాదుల సమకూర్చెను. వారెంతో ఆనందించిరి. అంత ప్రభావతి, యౌవనాశ్వుని భార్య వచ్చి వృషకేతున కారతిచ్చి 'నీమూలాన నా మంగళసూత్ర మాగినది. పతిదానము చేసిన వీరుడవు' అని యెంతో పొగడినది.

అంత భీమసేనుడు యౌవనాశ్వుని యజ్ఞముచూడ రమ్మని ఆహ్వానించెను. అతడు 'పిలిచినగాని పెండ్లికిపోరాదు,

కాని పిలువకున్నను యజ్ఞమునకు పోవచ్చును. అందును నీవు పిలిచినావుకదా! తప్పక వత్తుము' అని నగరములోనివారి నెల్లరను రమ్మని చాటింపు వేయించెను. ప్రభావతి 'ద్రౌప దిని చూడవలెనని యున్నది. నేనుకూడ వత్తు నన్నది.' రాజు 'సరే ర'మ్మనెను. నగరములోనివా రెల్లరును ప్రయాణ మైరి ఇంతలోపల భీము డాడార్తను ముందుగా అన్నగారికి చెప్పుటకై హస్తినాపురి కేగెను.

అప్పటికి ధర్మరాజు సభలో నుండెను. భీము డాతనికి నమస్కరించి తమ విజయమును చెప్పెను. అత డానందిం చెను. ద్రౌపదికికూడ ఆవార్త చెప్పుమని భీము నంపెను. భీముడు అంతఃపురములోనికి వెళ్లెను. ద్రౌపది అతని కెదు రుగా వచ్చి జరిగినసంగతి తెలిసికొని ఎంత కష్టపడినారు? ఈగంట్లన్నియు యుద్ధములోనివే? మీతో సరిగా పోరునల్పిన ఆ వీరు డెవ్వడు? అని మొడలు నిమురుచు అడిగినది. దాని కతడు యౌవనాశ్వునికొడుకు సువేగుడు నాతో సమముగా ద్వంద్వయుద్ధము చేసినాడు. అతనితల్లి వీరమాత ప్రభావతి నిన్ను చూడవలెనని వచ్చుచున్నది. ఇంతలోపల నీవును సిద్ధముగా నుండు మని చెప్పెను. ఆమెయు మహానంద ముతో పన్నీట జలకమాడి శుభ్రమైన కౌశేయమును ధరించి వింతమైన ఆభరణములు ధరించుకొన్నది.

అంతలో యౌవనాశ్వుని సేనలు హస్తినాపురిని చేరి నవి. ధర్మరాజాదు లెదురువెళ్ళి రాజమర్యాదలు చేసిరి. యౌవనాశ్వుడు ధర్మరాజునకు నమస్కరించెను. ప్రభావతి

రాణివాసమునకేగి కుంతీదేవికి, ద్రౌపదికి నమస్కరించినది. సుదేష్ణుడు అందరికి నమస్కరించెను. అప్పుడు కృష్ణుడు కొన్నాళ్ళుండి ద్వారకకేగెను. అంత ధర్మరాజువద్దకు వేదవ్యాసమహర్షి రాగా అతనికి నమస్కరించి అతనివలన మరుత్తుడు యజ్ఞము చేసిన విధమును తెలిసికొనెను.

అంత చైత్రమాసము వచ్చినది. ధర్మరాజు కృష్ణుని పిలువుమని భీముని పంపెను. భీముడు ద్వారక కేగుసరికి శ్రీకృష్ణుడు భోజనము చేయుచుండెను. ద్వారపాలకులవలన శ్రీకృష్ణుడు భీముని రాకను విని లోనికి రమ్మనెను. లోనికి వచ్చిన భీముని 'బావా! వ్యాయామము చేసి శ్రమపడినావు? ఆకలి వేయుచున్నదేమో? ముందు భోజనము చేయుము. తర్వాత మాట్లాడుకొనవచ్చును. అనగా అతడు నీ కాకలి యేమో తెలియదు. పాలియ్యవచ్చిన పూతన రక్తమాంసములు పీల్చినావు. ఇంటిలో వెన్నలు చాలక ఊరంతయు కొల్లగొట్టినావు తల్లి పెట్టినది చాలక కుచేలుని అటుకులు తినినావు. అని పరిహాసములు చేయుచు భోజనమునకులేచి 'నా అదృష్టవశాత్తు నీసహపంక్తి భోజనము దక్కినది' అనుచు విందారగించెను.

భోజనములు కాగానే తాంబూలములు వేసికొనుచు యజ్ఞమునకు సకుటుంబ సపరివారముగా శ్రీకృష్ణుని రమ్మని ధర్మజుడు చెప్పినట్లు చెప్పెను. అప్పుడు కృష్ణుడు కృతవర్మతో పట్టణమున చాటింపుమనెను. అత డట్లు చేయించెను. శ్రీకృష్ణుడు భార్యలకు పల్లకు లేర్పాటు చేయించి బంధు

మిత్రాదులతో పయనమయ్యెను. అందరును మహోత్సాహ ములతో ఏనుగులు, గుర్రాలు, రథాలు, బండ్లు కట్టుకొని బయలుదేరిరి. మార్గమధ్యమున కృష్ణుడొక్కచోట విడిసెను. అక్కడికి గోపకులెందరో వచ్చి కృష్ణునికెన్నో కానుకలిచ్చి అతని నెన్నోరీతుల స్తుతించిరి. అక్కడినుండి పరివారమును వెనుక రమ్మని శ్రీకృష్ణుడు భీముడును ముందుగా హస్తి నగరమున కేగిరి. ధర్మరాజు కృష్ణునకు తగు మర్యాదలుచేసి 'ఏమి నాయనా! నీ వొక్కడవే వచ్చినావు? ఏదీ, నీపరి వారము, భార్యా పుత్రాదులు!' అనుటతో వా రందరును వెనుక వచ్చుచున్నారు. నేను నిన్ను చూడవలెనను ఉబ లాటముతో ముందుగా వచ్చినాను అనెను. శ్రీకృష్ణునకు నిజముగా ధర్మజునిమీద అంతప్రేమ ఉన్నది.

అంత అనుసాళ్వు డనురాజు కృష్ణుడు తన అన్న నెప్పుడో చంపెనను కోపముతో ఆ పగ తీర్చుకొనదలచి ఇక్కడ కృష్ణు డున్నట్లు తెలిసికొని ధర్మరాజుమీదికి దండెత్తెను. అతనిసేనలు వచ్చి నగరము చుట్టుముట్టినవి. ధర్మరాజు సేనల నంపెను. భీమార్జున కృష్ణులు ముందున కేగిరి. ఇంతలో అతడు యజ్ఞియాశ్వమును పట్టించెను. అది వినుసరికి కృష్ణునికి మరింత ఒళ్ళుమండినది. అంత వృషకేతుడు నేను వెళ్ళి అనుసాళ్వుని కొట్టితే లేకున్న పంచమహాపాతక ములు వచ్చుంటుగాక! అని ఒట్టుపెట్టి బయలుదేరెను. అందరును యుద్ధమునకు తలపడిరి. భీముడు ప్రచండముగా శత్రుసేనల చెండాడుచుండెను. అంతలో అనుసాళ్వుడు

భీముని నిశితశస్త్రములు వేసి నొప్పించెను. భీముడు మూర్ఛపోయెను. అవిచూచి ఉగ్రుడై శ్రీకృష్ణుడు డతనిమీదికి వెళ్ళెను. అనుసాళ్వుడు 'నేను నీకోసమనియే వచ్చితిని. తక్కినవా రడ్డము వచ్చినందున కొట్టితిని. కాని, నాకు వారిపై కోపములేదని అతనిపై శరవర్షము కురిపించెను. అందొకబాణము రొమ్మునునాటి కృష్ణుడు మూర్ఛపోయెను. అది వినువరికి సేనకు గుండెలు లేవు. పటాపంచలై పారిపోజొచ్చినవి: అంత వృషకేతుడు వారికి ధైర్యముచెప్పి తా నాతనితో యుద్ధమునకు గడంగెను. అతని శరవర్షములో అనుసాళ్వుడు కప్పుపడిపోయెను. అత డుక్కిరి బిక్కిరియైపోయెను. అంతలో వృషకేతు డతని నారితో రెక్కలు విరిచి కట్టి ధర్మరాజుకాళ్ళముందు పడవేసెను. ధర్మజుడు అతనిని క్షమించెను. అనుసాళ్వుడు 'నేను యజ్ఞాశ్వమును రక్షించుటకు వెళ్లుదును. నా గర్వము తగ్గినది. నన్ను మన్నించి నీ తమ్ములలో నొకనిగా భావించుకొనుడు' అనెను. అత 'డట్లే' అనెను.

అంత చైత్రపూర్ణిమ వచ్చినది. ధర్మరాజు ద్రౌపదీ సమేతుడై యజ్ఞదీక్ష పూనెను. యథావిధిగా ఇరువదివేల మంది ఋత్విక్కులకు దక్షిణలిచ్చి యజ్ఞాశ్వమును పూజించి వదలెను. దానిని రక్షించుట కర్జునుడు ముఖ్యుడుగా పంపబడినాడు అతనికి తోడుగా యౌవనాశ్వుడు, అనుసాళ్వుడు బయలు దేరిరి. ఆ యజ్ఞాశ్వము తన యిష్టమువచ్చినట్లు తిరుగుచుండెను.

అట్లా గుఱ్ఱము తిరుగుచు నర్మదానది యొడ్డుననున్న మాహిష్మతీపట్టణ ప్రాంతమున కేగెను. ఆ పట్టణమును నీల ధ్వజుడను రాజేలుచుండెను. అతనిసుతుడు 'ప్రవీరుడు.' అతడు భార్యతోగూడి విహారమునకై ఊరివెలుపలనున్న నగరోద్యానమునకు వచ్చెను. అక్కడకు నర్మదమీదనుండి చల్లనిగాలి వీచుచుండెను, ఆ గాలి ననుభవించుచు హాయిగా తిరుగుచున్న వారి కీగుఱ్ఱ మగుపడినది. దానిని చూచుట తోడనే వారికి విచిత్రమైనది. ఇది అన్నిగుఱ్ఱములలాగున లేదుగా. అతని భార్య మదనమంజరి 'నాథా! ఇది మన గుఱ్ఱపుశాలలోఉండదగినది. పట్టిరండు' అన్నది. 'సరే' అనిఅతడు దాని దగ్గరకు వెళ్ళునరికి దానిముఖముమీద బంగారుపత్రిక యున్నది. "యుధిష్ఠిరుడు అశ్వమేధమునకై దీనిని వదిలినాడు. దీని రక్షించుటకై ఈశ్వరుని గెలిచిన అర్జునుడు వచ్చుచున్నాడు. ఎవరైన వీరులున్న పట్టవచ్చును" అని ఉన్నది. అది చదివికొని అతడు భార్యతో దీనివెనుక అర్జునుడు వచ్చుచున్నాడట. నేనతనితో యుద్ధముచేసిగెల్చి దీనిని తెత్తును. నీవు ముందుగా రాణివాసమున కేగుమని ఆమె నింటికిపంపి తా నాగుఱ్ఱమును కట్టివేసెను.

అదిచూచి వృషకేతుడు 'రాజకుమారా! దీనిని విడువుము. లేకున్న ప్రాణముతో విడువగలవు' అని హెచ్చరించెను. దానితో అతనికి కోపము హెచ్చినది.' అంతవీరుడ వేమి? నిన్ను కట్టికాని, దీనిని విడువను! అని యుద్ధమునకు తల పడెను. ఒక్కడైనను శత్రుసేనలతో హోరాహోరిగా పోరు

సల్పుచుండెను. అంత వృషకేతుడు శరాణములతో నొప్పింపగా ప్రవీరుడు మూర్ఛపొందెను. అంతలో కొడుకు యజ్ఞాశ్వమును పట్టినసంగతి తెలిసి నీలధ్వజుడు మూడక్షౌహిణుల సేనతో వచ్చెను. ఉభయపక్షములవారికి ఘోరముగాయుద్ధమగుచుండెను. నీలధ్వజుడు అర్జునుడును శరవర్షముల కురిపించుచుండిరి. అంత అగ్నిదేవుడు నీలధ్వజునిఅల్లుడు కనుక ఆతని తరపునవచ్చి అర్జునునిసేనలను కాల్చివేయుచుండెను. ఎన్ని వారుణాస్త్రములు వేసినను ఆ అగ్ని చల్లారలేదు. ఆసందడిలో నీలధ్వజుడశ్వమునుబట్టి నగరమును ప్రవేశించెను. ఇంకను అగ్నిహోత్రుడు ప్రజ్వలించుచునే యుండెను.

అంత అర్జునుడు అగ్ని దేవునకు సమస్కరించి 'దేవా! నీ విచ్చినవేకదా! ఈ అస్త్రశస్త్రములు, ధనుర్బాణములు, రథమును! అప్పుడు నా కెంతో సహాయముచేసినవాడ వీనాడింతకోప మేల? నీవు శాంతింపకున్న నేనాగలేను' అని ప్రార్థించెను. అయినను మంటలు హెచ్చెనేకాని తగ్గలేదు. దానితో అర్జునున కొడలుమండినది. నారాయణాస్త్రమును సంధించి ప్రయోగించెను. అది భూనభోంతరాళముల దహించు మంటలతో అగ్నిహోత్రునిపైకి వచ్చుచుండెను. అగ్నిహోత్రుని గుండె దడదడలాడినది. బ్రాహ్మణరూపముతో అర్జునుని వద్దకు వెళ్ళి 'పార్థా! నీవు శ్రీహరిని సేవించువాడవు. నీకు యజ్ఞములు, తీర్థసేవలు, దానధర్మములు నెందుకు? ఆశ్రీహరి ఒక్కడు చాలు నిన్నుద్ధరించుటకు! నన్ను మన్నింపుము. అస్త్ర ముపసంహరింపుము. నేను అల్లుడనై నందున రాజునకు

ప్రీతికల్గుటకై ఇట్లు చేయవలసివచ్చినది. ఆ ఆవేశమున నీకు కృతఘ్నుడనైనాను; ఇప్పుడే వెళ్ళి రాజును నీవద్దకు తీసికొని వత్తును' అని తాను కాల్చిన సేననంతను బ్రదికించి, నీలధ్వజు నితో చెప్పుటకై పట్టణములోని కేగెను.

ఇది విని జనమేజయుడు జైమిని మహర్షితో 'మునీంద్రా! అగ్ని నీలధ్వజున కెట్లు డెల్లైనాడు.? ఆకథ చెప్పు' మనెను? అతడు చెప్పసాగెను.

నీలధ్వజుని పెద్దభార్య జ్వాల. ఆమెకు స్వాహా అను కూతురు పుట్టినది. ఆమె చాల అందగత్తె. అన్ని విద్యల నారితేరినది. ఆమెకు వివాహాయుక్తవయస్సు రాగా, నీల ధ్వజుడు రాజకుమారులపటములను తెప్పించి ఇష్టమువచ్చిన రాజకుమారుని వరింపు మనెను. ఆమె దేవతలనేకాని నరుల నెవ్వరిని వరింపననెను. ఆమెకు దేవతలలోకూడ ఇంద్రుడు, కుబేరుడు మొదలైనవారు నచ్చలేదు. 'అగ్నిముఖావై దేవాః' (దేవతల కందరికి అగ్నిహోత్రుడే ప్రథముడు) అని అగ్ని హోత్రునే వరింతు నన్నది. చెలికత్తెలు 'అతడు అంటినవారి నెల్ల కాల్చును. ఎప్పుడును మంటలతో వేడిగానుండును. అట్టివాడా నీకు నచ్చిన వరుడు? అని హేళనచేసిరి. ఏమైనను అగ్ని దేవునే కాని మరియొకరిని వరింపనని పట్టుపట్టినది. ఈ విషయ మగ్నికి తెలిసి మహోత్సాహముతో బ్రాహ్మ ణుడై వచ్చి రాజును 'తన కాతని కుమార్తె ని' మ్మనెను. అతడు 'స్వాహాదేవి అగ్నినేకాని వరింపదు. మరి యే కన్య నిమ్మన్నను ఇచ్చెదను' అనెను. అతడు 'నేనే అగ్నిదేవుడ'

సని తన నిజరూపము చూపగా నతడు సంతోషముతో నంగీకరించెను. ఈ వార్త తన ముద్దులకొమరితకు చెప్పి నుహా వైభవముగా పెండ్లి చేసెను. అది మొదలు అగ్ని దేవుడు నీలధ్వజునకు నిత్యసన్నిహితుడై యుండెను. అదే అతని ధైర్యము.

•

అట్లు అగ్నిహోత్రుడు నీలధ్వజుని సభ కేగగానే అతడు 'అర్జునుని సేనయంతయు భస్మమైనదా?' అని ప్రశ్నించెను, దాని కగ్ని 'అర్జునుడు శ్రీమన్నారాయణభక్తుడు. అతనిని గెల్చుట కెవరితరమును కాదు. అంతేగాక నేను ఖాండవవన దహనము చేయుచున్నప్పుడు అర్జునుడు శరపంజరము కట్టినాపైకి వచ్చిన ఇంద్రుని పారద్రోలెను. నీ బంధుత్వమూలకముగా కృతఘ్నుడనైతిని. సేనల కాల్చితిని అతనిచే పరాభవింపబడితిని. ఇక అనవసరముగా యుద్ధము చేయక వెంటనే అతని గుర్రము నతని కిచ్చి శరణవేడు' మనెను అది విని రాజు 'సరే' అనగానే అతని పెద్దభార్య జ్వాల 'నాథా! అతడు చెప్పుగాక! కాని మీ రెట్లువిందురు? పట్టినపట్టును బ్రహ్మాండనాయకు డడ్డువచ్చుగాక, వదలరాదు. అది వీరధర్మమా? యుద్ధముచేయుము. గెల్చిన రాజ్యమును, చచ్చిన వీరస్వర్గమును పొందుదువు' అన్నది. ఆ మాటలతో వేడెక్కి నీలధ్వజుడు సేనల సమకూర్చుకొని యుద్ధమునకుసన్నద్ధుడై అర్జును నెదుర్కొనెను అత డింకను గుర్రమును తెచ్చుచుండెనేమో అని చూచుచుండెను. ఆ యుద్ధసంరంభము చూచుసరికి అర్జునుని కెంతో కోపమువచ్చి మహోగ్రుడై శర

పరంపరలు వేయసాగెను. నీలధ్వజుని వింటిని, బాణములను రథమును భగ్నముచేసెను. మరియొక రథమెక్కిన దానిని, ఇట్లెన్నియో రథములు ముక్కలుచేయగా ఆఖరి కతడొక్క రథముపై మూర్ఛపోయి ఇంటికి పోయెను. అప్పు డతడు 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అని ఆడుదానిమాటనమ్మినందున తన కింతవచ్చెనని గుర్రమును వదలుమనెను. వదలవలదని పట్టు పట్టిన జ్వాలను నగరమునుండి పారద్రోలెను. ఏనుగులు, గుర్రములు మొదలైన కానుకలెన్నో పుచ్చుకొని అర్జునునివద్దకు వచ్చి సఖ్యముచేసికొనెను.

జ్వాల తన నట్లు భర్త నగరము వెడలగొట్టగా కాశీపట్టణము నేలుచున్న తన తమ్ముడు. ఉల్ముకునివద్ద కేగినది. ఇంతహఠాత్తుగావచ్చిన చెల్లెలిని చూచి అతడేమివార్తయని అడుగగా ఆమె అతిదుఃఖముతో తనకు జరిగిన పరాభవవార్త నంతను చెప్పి 'ఆ అర్జునుని చంపకున్న నాకసితీరదు. నీవు నా పగతీర్చవలెను. అన్నది' అతడు ఆగుర్రము రాగానే పట్టుకొని అతనితో యుద్ధము చేయుదును. విచారింపకుము అనెను. జ్వాల 'గుర్ర మిటువచ్చునని నమ్మకమేమున్నది? నీవు వెళ్లి అతని నడ్డగించుము' అని తొందరచేయుటతో అతనికి మండి 'నీవు నావద్దనుండవలదు. ఎక్కడికైనపొమ్ము, అక్కడ అత్తిల్లు అంటించి. ఇక్కడపుట్టింటి నంటించుటకై వచ్చినావు. నీ వెక్కడవున్న అక్కడనే దగ్ధపటల మగును' అని రోషముతో పలికెను. ఆమెకు ఉత్రోశ్కముచ్చినది. వెంటనే గిరుక్కున తిరిగి గంగయొడ్డునకేగి పడవనెక్కినది. అంతలో

కాలికి నీరు తగిలినది అప్పు డామె 'నమశ్శివాయ! పాపాత్ము రాలి నంటితినే' అన్నది. అది విన్న వారందరును 'ఇదేమి! పరమపవిత్రమైన గంగను దూషించుచున్నావు?' అనిరి. అంత గంగాదేవి ప్రత్యక్షమై 'అమ్మా' నా యందే దోష మున్నది? నన్నట్లు దూషించితివి?' చెప్పుమనగా, జ్వాల 'నీవు పిల్లలను కన్నతల్లివి కావు. నీకు ఏ కోశమునను దయ లేదు. ఏడుగురు కొడుకులను పుట్టగానే నీ పొట్టను పెట్టు కొన్నావు. ఎనిమిదవవానిని భీష్ముని శిఖండినిముందిడుకొని అర్జునుడు చంపెనని వినికూడ, విచారములేకుండ, పగ సాధింపక, ఇట్లు సంతోషముతో ఉన్నావు. నిన్నంటరాదు' అన్నది. ఆడువారి కేదివచ్చినను అంతే, ఆగ్రహానుగ్రహ ములు ఆపలేను. పగసాధించుటకు వారితర్వాతనే మరొకరు. త్రాచుపాము పగ. త్రాచుపాముకూడ పాములలో ఆడుదే ఆమెమాటలు విషమెక్కిన శూలకెక్కినవి. గంగాదేవి ఎంత సురాసురాలైనను మండిపడి 'ఆరుమాసములలో అర్జునునితల తెగి క్రిందపడుగాక!' అని శపించి అంతర్ధానమైనది. జ్వాల పగ అంతటితో చల్లారలేదు. తాను తపస్సుచేసి అర్జునుని తల తెగగొట్టు బాణమైనది.

అక్కడ యజ్ఞాశ్వము ఇష్టమువచ్చినట్లు తిరుగుచు వింధ్యాటవిలోనున్న ఒకరాయిదగ్గరికి పోయెను. అది పెద్ద రాయి. కొన్ని ఆమడ లున్నది. ఒకేరాయి గుఱ్ఱమున కా రాతిని చూచుటతో ప్రాణము లేచివచ్చినది. దాని ఒంటి తీట తగ్గుటకు తగినరాయి దొరికినదికదా అని, తీటతీరునట్లు

దానితో రాచికొన్నది. అంతే జిగురుకండె నంటుకొని పిట్ట ఎగురలేకుండ అంటుకొనిపోయినట్లు అంటుకొనిపోయినది. ఇక కదలలేదు; మెదలలేదు. దానిని జూచి సైనికులు భయపడి అర్జునునితో చెప్పిరి. అతడు వచ్చి తన శక్తికొలది లాగి లాగిచూచినాడు. లాభములేదు. రాలేదు.

అప్పు డేమియు తోచక దగ్గరలోనున్న సౌబరి మహర్షి ఆశ్రమమునకు వెళ్లెను. తన సైనికుల నందరిని ఆశ్రమమునుందే అట్టేపెట్టి తాను, మరికొందరు రాజ కుమారులు కలిసి లోని కేగిరి. ఆశ్రమములో సింహములు ఏనుగులు నాకుచున్నవి. పెద్దపులులు లేడిపిల్లలకు పాలిచ్చు చున్నవి. పిల్లులు ఎలుకపిల్లలను కలుగులకు చేర్చుచున్నవి. సహజవైరములుకూడ మాని అంత ప్రేమతో శాంతముగా ఉండు మృగములను చూచుసరి కతని కాశ్చర్యము వేసినది. తాను రాజు. ఆజ్ఞపెట్టి అందరిని సక్రమమైన మార్గమున నడుపుచుండును. కాని వారు నడువవద్దా? అంతన్యాయమున్న ఇకలేని దేమున్నది? ఇక్కడ అదుపాజ్ఞలు లేవే. అయినంత మాత్రాన అల్లరచిల్లర పనులున్నవా? ఎంత శాంతము! ఒక్క మహర్షి మనస్సును నియమించి శాంతిపరచిన మూలాన అన్నిజంతువులు, పక్షులు శాంతమైపోయినవి. ఇట్టివారు రాజ్యమున కొక్క రున్న చాలదా? ఎట్లుందురు? మనోనిగ్రహము చాల కష్టమైనది. కాక వారికి లోకముతో పనేమున్నది? అందరితోను సంబంధమును విడిచికదా వారు మునులైనది. ఇప్పుడు మరల వీరితో సంబంధము పెట్టు

కొనునా? అర్జును డా మునిని చూచినాడు. జడలు పెరిగి సత్త్వగుణము మూర్తీభవించిన ట్లున్నాడు. తపస్సుతో ఆయన శరీరము శుష్కించినది; కాని తేజస్సుతో ముఖము కలకలలాడుచున్నది. అది బ్రహ్మతేజస్సు. దుష్టులను శాంత పరచును. శాంతులకు చెప్పలేని సౌఖ్యమును, ఆనందమును యిచ్చును.

అర్జును డాయనకు నేలపై సాగిలపడి సాష్టాంగ దండ ప్రణామము చేసినాడు. ఆ ముని చేయెత్తి దీవించినాడు. అర్జునుడు తన కథ చెప్పి 'ఆ గుఱ్ఱము రాతి నెందుకు తగులు కొని, అంటుకొనిపోయి, ఊడివచ్చుటలేదు' అడిగినాడు. దాని కా ముని త్రికాలజ్ఞుడుకనుక ఒక్కసారి కన్నులు మూసికొని దివ్యదృష్టితో చూచినాడు. అతనికంతయు కన్ను లకు కట్టినట్లైనది. 'ఆఁ! అదీసంగతి. చెప్పెదను వినుము' అని చెప్పనారంభించినాడు.

పూర్వము కౌండిన్యమహర్షి వద్ద ఉద్దాలకుడను ముని బాలుడు సకలవిద్యలు నేర్చుకున్నాడు. అతడు చదువుపూర్తి కాగానే సమావర్తనవ్రతము చేసికొని, స్నాతకుడై 'చండిక అను మునికన్యను పెండ్లాడినాడు. ఆమె చాల చిన్నది. అప్పుడు పెండ్లిండ్లేఅంత. ముప్పదేండ్లవానికిమూడేండ్ల పెండ్లి కూతురని సామెత. ఆమె బాల్యమునుండి భర్తయింటిలోనే పెరిగినది. అత డామెకు కావలసిన పువ్వులు, బుక్కాలు తెచ్చి యిచ్చి ఆమెను సంతోషపెట్టువాడు. కాని ఆమె గయ్యాళి. ఎన్ని చేయుగాక తన మొండిపట్టు విడిచేది కాదు. ఎప్పుడో

మొండిపట్టు పట్టుటకాదు. ఏపని చెప్పినను వ్యతిరేకమే. 'అవును అన్న కాదు' అనుటయే ఆమెతీరు. ఏమో పెద్దదైనచో కొంతగుణము కల్గునేమో అను ఆశతోను, హైందవ సంప్రదాయము ప్రకారము కట్టుకొన్నాక గుడ్డిదైనను, సడ్డిదైనను వదలకూడదు కనుకను అతడామెను పల్లెత్తుమాట అనువాడుకాడు. జపమాల తేవే అన్న త్రెంపిపోసెడిది. అవన్నియు నెత్తికొని మరల గ్రుచ్చుకొనువాడు. అగ్నిహోత్రమునకు సమిధలు తెమ్మన్న నిప్పులార్పివచ్చెడిది. అంగవస్త్రమియ్యవే అన్న నిలువుగాచింపి ఇచ్చెడిది. అది కట్టుకొనువాడు పాపమా అమాయకుడు. ఈ రీతిగా ప్రతిపనికి వేపుకొని తినుచున్నను కిమ్మనక కాలక్షేపముచేయుచుండగా గురువుగారు శిష్యులతోసహా ఆదారిని వెళ్ళుచు అతనిని చూచిపోదమని అక్కడికి వచ్చినారు. అతడు తన కుటుంబపు సంగతి చెప్పి 'ఈ సంసారము నిజముగా సాగరమో, యమలోకమో తెలియుటలే' దన్నాడు. గురువుగారు మహాబుద్ధిశాలి. 'అన్ని పనులకు కూడ అన్నదానికి వ్యతిరేకము చేయును కనుక అట్టే బాధలేదు. నీ వనుకున్నదానికి వ్యతిరేకము నీవు చెప్పిన,ఆమె దానికి వ్యతిరేకముచేయును, అప్పుడు నీవనుకొన్నపనియే జరుగు'నని సలహా ఇచ్చెను. సరే. అదే ప్రయోగించి చూతమని లోనికిపోయి భార్యనుపిలిచి 'అదిగో మాగురువుగారు లాగున ఉన్నారు. ఆయనకిక్కడ వార్చిపోసినట్లు పదిమంది శిష్యులను తీసికొనివచ్చినాడు. వెంటనే కిక్కురుమనకుండ గెంటివేయుము' అని కఠినముగా అన్నాడు. ఆమె బుగ్గలు నొక్కుకొనుచు ఓహోహో! చాల బాగున్నది. చదువు

లన్నియు చెప్పిన గురువుగారువచ్చినప్పుడు మర్యాదచేయక పోగా వెళ్ళగొట్టుటయా? ఇదేనా మీచదువు?' అనినాలుగు మాటలు అని వారందరిని లోనికి తోడ్కొనివచ్చి అర్ఘ్య పాద్యాదులిచ్చి షడ్రసోపేతముగా విందుచేసి పంపినది. అంత సేపు పైకి కొరకొరలాడుచు లోపల సంతోషములో మునిగి పోవుచు ఉద్దాలకుడెంతో ఆనందమనుభవించినాడు. ఇన్నాళ్ళ కీ నాడు అతడు భార్యచేత తనయిష్టమువచ్చినపని చేయించు కొనగలిగినాడు. అదికూడ గురూపదేశ ఫలితమే. ఇట్లు నాలుగు, పది రోజులు గడచినవి.

ఇంతలో తండ్రిగారి తద్దినము వచ్చినది. ఉద్దాలకుడు భార్యను, కేకవేసినాడు. 'ఓయి! చూచినావు. రేపే నాతండ్రి తద్దినము. నేను పెట్టను. నాకొక్కనాడైన ఇంటిలో అన్నము పెట్టక గురువునింటికి తోలినతండ్రికి తద్దిన మనవసరము అంతగా కాదుకూడదు అనిన ముసలిబ్రాహ్మణులను పిలిచి పనికిరానికూరలు—ఆనపకాయ వంకాయ మొదలైనవి వండి ఉడికీ ఉడకనివి వాళ్ళమొగాన పెట్టుదము గారెలు, పరమా న్నము కావలె నందువు, పిండిపాలరోజులలో పరమాన్నము లేమిటి సర్వంజగన్నాథం. ఏమియులేదు. ఏదోచూతము'అని ఏమియు ఇష్టములేని పరమనాస్తికునివలె మాటలాడినాడు. ఇష్టములేనియెడల పిలిచిచెప్పుట యెందులకు? అందులోనే కోరిక కనపడును

ఆమె నోరు నెత్తి మోదుకొని 'అయ్యో! ఇదా మీ నిష్ఠ? పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు తద్దినమైనను పెట్ట

వలదా? అందులోను చదువుకున్న వారు. సక్రమముగ, యథా శాస్త్రముగ పెట్టవలెను. లేకున్న నే నూరకొనను. మీరు వెళ్ళకపోయిన నేనే వెళ్ళి సంభారములన్నియు సమకూర్తును' అని నడ్డికట్టుకొని తానే బ్రాహ్మణులను నిమంత్రించి (చెప్పి) యథావిధిగా నాలుగుకూరలు, నాలుగుపచ్చళ్లు, పెసరపప్పు గారెలు, పరమాన్నము తయారుచేసి, సకాలమునకు భర్త చేత తద్దినము పెట్టించినది. అప్పటి కామె కోరిక నెరవేరినది. అతనిమనస్సు సంతృప్తిపడినది. పాప మాతడా సంతోష మును పట్టలేక, గురూపదేశమును మరచిపోయి, కొంచెము పిండములను నదిలో పారవేసి రమ్మనెను. ప్రియముగా, ఆమెకు అప్పటికి తెలిసినది ఇతనియెత్తు. పళ్ళు పటపట లాడించి, కళ్లెఱ్ఱజేసికొని, 'ఒరీ! దుర్మార్గుడా మాయమాటలు చెప్పి నాచే ఎంతపని చేయించుకొన్నావు? నీతండ్రికి తద్దినము ముట్టనిత్తునా?' అని వాటిని దొడ్డిలో పెంటమీద పారవేసెను.

ఉద్దాలకుని కింతవరకు కల్గినసంతోషము ఒక్కసారిగా కోపముగా మారినది. అతడు ప్రళయకాలరుద్రుడై, 'ఓసీ! బుద్ధిహీనురాలా! వేపచెట్టును పంచదారనీళ్ళుపోసి పెంచినట్లు నిన్ను చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసితిని నీగుణము కొంచమైనను మారలేదు. ఇక లాభములేదు. నీకర్మము నీ వనుభవింపుము' అని కమండలములోని నీటిని తీసి, నీవు చెప్పినను వినని రాతిగుండెదానవు. కనుక రాతివై పడియుండు మని శాపోదకము విడిచెను. ఏమున్నది? ఇప్పటి కామెకు

తెలిసివచ్చినది, తాను చేసిన తప్పు. కాళ్ళమీదపడి, గట్టిగా పట్టుకొని, మహా ప్రభో! తప్పు చేసితిని. తెలియని మూర్ఖురాలను. క్షమింపుము. శాపమోక్షమును ప్రసాదింపుము. అని ప్రతిమాలెను. చేతులు కాలినతరువాత ఆకులుపట్టుకొనిన లాభమేమున్నది? అయినను మహర్షులమాట లెంత కఠోరములో, మనస్సంత మెత్తనిది. అతడు మెత్తపడినాడు. కాని అన్నమాట త్రిప్పుకొనుట, వదలినగడ్డను పట్టుకొనుటవంటిదే ఆమెతో కొన్నేండ్లతర్వాత అర్జునుడువచ్చి, తాకగానే నీకు శాపమోక్షమగును. అని చెప్పి ఆతడు తపస్సునకు వెళ్ళెను. అందుచే అర్జునా! నీవు వెళ్ళి ఆ రాతిని చేతితో నంటుము. నీ గుఱ్ఱమువిడివడును. అని సౌబరిమహర్షి సెలవిచ్చెను.

అర్జునుడంత ఆశ్చర్యపడి రాతివద్దకు వెళ్ళి చేతితో తాకుసరికి, అది కరగి, ముద్దయై కుమ్మరిసారిపై మట్టి బొమ్మయగునట్లు ఆడుదియై, ఎదురుగా నిలువబడినది. ఆ నాడు అహల్యను చూడగానే శ్రీరాము డాశ్చర్యపడినట్లు, అర్జునుడును అబ్బురపడెను. ఇతనికి కథ ముందుగా తెలిసినది; రాముడు తర్వాత తెలిసికొనినాడు. అంతే భేధము అంత ఉద్దాలకుడు ఆమెతో సంసారము చేయుట కొల్లక సన్యాసియై వెళ్ళిపోయెను. ఆమెయు సన్యాసిని యైనది.

అట్లు విడివడిన యజ్ఞాశ్వము వింధ్యపర్వతమునుదాటి, చంపకాపుర సమీపమునకు వెళ్ళినది. ఆ పట్టణమేలు రాజు హంసధ్వజుడు అతడు విష్ణుభక్తుడు. ఆ గుఱ్ఱముసంగతి దూతలుచెప్పగా విని, అర్జునుని కొట్టినచో, శ్రీకృష్ణుడు

ప్రత్యక్షమగునని తలచి గుఱ్ఱము కట్టించెను. సైన్యములు సన్నసిద్ధములైనవి. భేరీ దుందుభులు ప్రయోగింపబడినవి. హంసధ్వజునకు డెబ్బదిమంది సేనాపతు లున్నారు. ఒకొక్కడు డెబ్బది యొక్క వేయి ఏనుగులు, డెబ్బదియొక్క వేయి రథములు. ఒకలక్ష గుఱ్ఱములు, లక్షకాల్బలమునకు అధికారి. వారుగాక ధనుడు, వలుడు. సురథుడు, సుధన్వుడు, సువలుడు, ధర్మబాహుడు అను కొడుకులు కలరు. వీరందరును విష్ణుభక్తివిరతులు, ఏకపత్నీవ్రతస్థులు. వారి ఆస్థానముననే ధర్మశాస్త్రము వ్రాసిన శంఖ లిఖితులు మంత్రులు, పురోహితులును అయి యుండిరి. మహారాజు యుద్ధమునకు వెళ్ళుచు, యుద్ధములోనికివచ్చుట కాలస్యము చేసినవారిని సలసలకాగు నూనెతొట్టెలలో వేయుడని ఆజ్ఞాపించెను. భటులావిషయము నూరెల్ల చాటించిరి. మగవారందరు మగవారై కత్తియు, డాలును చేపట్టి పెండ్లికివెళ్లునట్లు యుద్ధమునకు వెళ్ళిరి.

అంత సుధన్వుడు కవచము తొడిగికొనికత్తిచేబూని భార్యతో చెప్పుటకై రాణివాసమున కేగుసరికి ఆమెఅనుమతి నిచ్చుటకుబదులు తనకోరిక తెలిపినది. అతడుయుద్ధమునకుపోకున్నతండ్రి శిక్షించును. అందుచే పోవలెననగా ఋతుదివసమైనందునను, అందులో పదారవరోజు (ఆఖరిరోజు) అగుటవలనను తనకోరిక శాస్త్రీయము కనుక తప్పక తీర్చవలెనని పట్టుపట్టినది. అంత నాతడు ప్రభావతి (భార్యపేరు) మాట కాదనుటకు వీలులేక ఆమెను సంతోషపెట్టి యుద్ధమునకు కదలెను.

ఇంతలో హంసధ్వజుడు సుధన్వుడు రాకపోవుట నెరిగి అతనిని తనపురోహితుల కొప్పగించుమని భటుల కాజ్ఞయిచ్చెను. వారువచ్చుచుండ దారిలో సుధన్వ యెదురయ్యెను. అయినను వారు రాజాజ్ఞను చెప్పిరి. అతడు ధర్మబద్ధుడై రథముదిగి వారితోపాటు వెనుకకు మరలెను. అంత శంఖలిఖితులాతనికి శిక్షావిధానము చెప్పి నూనెను కాపించి దానిలో వేయించిరి. కాని అతని కది చన్నీటికొలనులాగున నైనది. అ దేమి మాయయో! నూనె కాగలేదేమో? అని కొబ్బరికాయ దానిలో వేయగా ప్రేలి ముక్క ముక్కలై పోయినది. అప్పుడు ప్రహ్లాదునివలె నితడుకూడ భగవద్భక్తుడు కనుక అట్లు జరిగియుండునని తలచి, వారు తాము అట్టి భగవద్భక్తుని గుర్తించక శిక్షించినందుకు తామకూడ ఆ నూనె పెనములో పడిరి. సుధన్వునికోరికపై భగవానుడు వారికికూడ యే బాధయు లేకుండ చేసెను. అంత ఈ వార్త తెలిసి హంసధ్వజుడెంతో సంతోషించెను.

ఇంతలో సుధన్వుడు యుద్ధములోనికి వచ్చెను తండ్రి అతనికి సేనాపతిత్వమిచ్చెను. అతడు మహోత్సాహముతో శత్రుభయంకరుడై యుద్ధముచేయుచుండెను. వృషకేతుడు తాను యుద్ధముచేయుదునని సుధన్వునితో కలియబడెను. కాని కొలదిసేపటిలోనే మూర్ఛపోయెను అప్పు డర్జునుడు కోపోద్రిక్తుడై ముందునకు వెళ్ళెను.

సుధన్వ డర్జునునితో 'కృష్ణసారథ్యమున భారతయుద్ధమున గెల్చితివి. కాని నీ వొక్కడివే అయిన ఏమయ్యెడిదో?

అదియు నొక మగతనమేనా? కాచుకొమ్ము’ అని బాణవృష్టి కురిపించెను అర్జునుడును వాటినన్నింటిని మధ్యదారిలోనే ఖండించెను. ఇక సామాన్య బాణములతో పనికాదని యిద్దరును అస్త్రయుద్ధమారంభించిరి. ఆగ్నేయ, వారుణ, ఇంద్ర, కౌబేర, నాగాద్యస్త్రము లెన్ని వేసినను సుధన్వుడన్నిటిని ఉపసంహరించెను. అప్పు డర్జునునికి పాలుపోక శ్రీకృష్ణుని స్మరించెను. అతడు వెంటనే రథముమీదికి వచ్చి నాలెను దానితో అర్జునునికి సత్తువ పెరిగినది. అండచూచుకొనియేకదా ఎవరైనను గర్వపడుట! సుధన్వుని మూడు బాణములతో తలనరికెదనని ప్రతిజ్ఞచేసెను. ఇంతవరకు ఎక్కడికిపోయినవో యీ ప్రతిజ్ఞలు! సుధన్వుడుమాత్రము తక్కువవాడా? నీ బాణత్రయమును మధ్యమార్గమున త్రుంపకపోయిన నేను హరిభక్తుడనే కానను. ఎట్లైనను కాచుకొనవలసిన బాధ్యత కృష్ణుని మీదనే పడినది. కృష్ణు డర్జునుని అనవసరముగా ప్రతిజ్ఞలుపట్టి తన్ను బాధింపకుమని మందలించి తన పుణ్యమును కొంతధారపోయగా మొదటిబాణము నాతడు వదలెను సుధన్వుడు దానిని నరికెను. మరికొంత పుణ్యమును ధారవోసి రెండవ బాణమును వదలుమనెను. దానినికూడ నరికివేసెను. ఇక ఒక్కబాణములో ఉన్నది, అర్జునుని ప్రతిజ్ఞ! ‘కృష్ణా! ఎట్లు దాటింతువో’! అని హెచ్చరించినాడు. కృష్ణుడు తనశక్తినంతయు దానిలో ప్రవేశపెట్టినాడు. సుధన్వుడా భగవంతునే తలచుకొని బాణమువేసినాడు. ఇది కృష్ణునికి పరీక్షాసమయమైనది. ఎవరిమాటకూడ అబద్ధముకాకుండ జరుగవలసిన పనులు జరుగవలెను. అది భగవత్తంత్రము. అట్లు జరుగునని

ఎవరూహింపగలరు? అర్జునుని బాణము మధ్యలో రెండుముక్కలైనది. అక్కడికి సుధన్వుని ప్రతిన నెరవేరినది. అతడంతే కోరినది! మిలుకున్నముక్క అతనితలను తెగగొట్టినది. దానితో అర్జునుని ప్రతిజ్ఞయు నెరవేరినది. ఆ తల నారాయణ నామోచ్చారణచేయుచు కృష్ణునిపాదములపై బడినది. చని పోయికూడ తనపైనంత భక్తి కల్గియున్నందుకు కృష్ణు డెంతో సంతోషించెను. కాని విధిచేసి యూరకున్నాడు. ఆ తలను హంసధ్వజుని కాళ్ళపై వేసినాడు. అత డెంతో దుఃఖించి 'ఇది భగవత్కరుణ' అని కృష్ణుని పాదములమీదికే విసరినాడు. అంత నతడు దానినాకాశములోనికి విసరగా అది అదృశ్యమై పోయినది.

అదిచూచి సురథుడు తండ్రి నోదార్చి తాను యుద్ధమునకువచ్చెను, కృష్ణుడు మనమితనిముందాగలేము. వెనుకకు పోవుద మని మూడుమైళ్ళు వెనుకకు రథముతోలుకొనిపోయి తమముందు సేననంతను ఉంచెను కాని సురథునకుకావలసిన నది వారేకాని సేనయా? ఈ సేనను బాణవర్షముతో చెల్లా చెదరుచేసి కృష్ణార్జునుల తాకెను. అప్పుడతనితో వారికి పోరు తప్పనిసరియైనది. ఆ యిద్దరియుద్ధము చూచువారి కెంతో భయాశ్చర్యములు కల్గించినది. ఒకరికంటె ఒకరు హెచ్చు. ఎవరును తీసిపోరు. అర్జునుడు నీ తల తెగగొట్టెదను చూడు నా శపథము అనెను. సురథుడు నీ దేహము క్రిందిపారవేసెదను చూడు మనెను. అర్జునుడు బాణములతో సురథుని రథమును విరిచి విరథునిచేసెను. చేయి తెగగొట్టెను. అతడు

రెండవచేతితో గదను త్రిప్పివిసరెను. రెండవచేతినికూడ తెగ
గొట్టి అర్జునుడాతనితలను నరికెను, ఆ తెగినతలవెళ్ళి అర్జునుని
తలకుకొట్టుకొన్నది. ఆదెబ్బకు తట్టుకొనలేక అర్జునుడు మూర్ఛ
పోయెను. శ్రీకృష్ణు డతనిమూర్ఛదేర్చి సంతోషించుసరికి
సురథునిశిరమువచ్చి అతనికాళ్ళపై బడినది. శ్రీకృష్ణు డా
శిరస్సునుచేతబట్టి అర్జునునితో పార్థా! ఇతడు సత్యసంధుడు,
హరిభక్తుడు జనవంద్యుడు అని కీర్తించుటతో అత డా
తలకు వందనముచేసెను. యుద్ధములోనరికుట రాజకృత్యము,
వందనముచేయుటసజ్జనలక్షణము. దానికిదీనికినివిరోధము లేదు

అప్పుడు కృష్ణు డా సురథునికి మోక్షమిప్పింపదలచి
గరుత్మంతుని తలచుకొనెను. తలచుకొన్నంతలో రెక్కలు
వచ్చినపర్వతములాగున గరుత్మంతుడు వచ్చి ముందు వ్రాలి
నమస్కరించి సెలవేమని యడిగెను. శ్రీకృష్ణు డా సురథుని
తలను త్రివేణీసంగమమున (గంగా యమునా సరస్వతులు
మూడును ప్రయాగవద్ద కలిసినవి దానిని త్రివేణీసంగమ మం
దురు) పడవైచిరమ్మని పంపెను. అత డా తలనెత్తుకొనిపోవు
చుండ ఆకాశముమీద విహరించుచున్న పరమేశ్వరుడు ఆ
మహాత్ముని తలను తెమ్మని ప్రమథుల నంపెను. కాని గరుడుడు
వారిని లక్ష్యపెట్టక కసరికొట్టెను. అంత శివుడు కుమార
స్వామిని నంపెను. అతను వచ్చి కలియబడుటతో నెగ్గుటకష్ట
మని గరుత్మంతు డా తల నక్కడనుండియే ప్రయాగకు విసి
రెను. అది వెళ్ళిసరిగా త్రివేణీసంగమములో పడినది అంతలో
కుమారస్వామి దానినిపట్టి శివునకర్పించెను. ఆ మహేశ్వరుడు

మహానందముతో దానిని తనకపాలమాలికలో నాయకమణి (హారమునకు మధ్యనుంచునది) గా గ్రుచ్చి మెడలో ధరించెను. సత్యసంధులు, వ్రతనిష్ఠులు, భగవద్భక్తులు నైనవారి శిరస్సులను భగవంతుడు, పరమేశ్వరుడు మాలికగా గ్రుచ్చి మెడలో ధరించును. సత్కర్మలు చేసినవారన్న భగవంతున కెంతయో ప్రీతికదా!

అంత హంసధ్వజుడు తనకుమారులందరును చనిపోయి నందుకు విచారముతో సేనలసమకూర్చుకొని యుద్ధమునకు వెళ్లెను. అంత కృష్ణుడు అతని కెదురు వెళ్లెను. హంసధ్వజుడును క్రిందికిదిగివచ్చెను. కృష్ణుడాతనికౌగిలించుకొనిదుఃఖము పోవునట్లు పరామర్శించి అర్జునునితో స్నేహముచేయుమనెను. అతడుకూడ 'సదర్మమైనందుననే నాకన్నికష్టములును తొలగినవి. నాకేవిచారమును లేదు' అని అర్జునునితో స్నేహము చేసెను. అర్జునుడతనియూరిలో విశ్రాంతిదీసికొనెను. అంత గుఱ్ఱము వెళ్ళుచున్నందున దాని వెనుకనే బయలుదేరి వెళ్ళెను.

ఆ గుఱ్ఱ మట్లు పోవుచు దారిలో దాహమువేసి ఎదురుగానున్న చెరువులోదిగి నీరు త్రాగెను. అంతలో అది ఆడు గుఱ్ఱమైపోయినది. ఒక్కక్షణంతలో అది పెద్దపులియైనది. అది చూచుసరికి కర్జునునికి ఆశ్చర్యమువేసినది. అనుట విని జనమేజయుడు 'ఆ గుఱ్ఱమట్లగుటకు కారణమేమి?' అని జైమినిమహర్షి నడిగెను. అత డిట్లు చెప్పనారంభించెను.

పూర్వము పార్వతీదేవి ఈశ్వరునుగూర్చి ఆ చెరువులో దిగి తపస్సుచేసినది. అప్పు డొకరాక్షసు డామె తపస్సును

చెరుపవచ్చెను. అంత నామె వానిని భస్మముచేసినది. అంతతో ఊరకొనక 'ఈ చెరువులో ఎవరు దిగినను ఆడువారగుగాక!' అని శపించినది. అందుచేత గుఱ్ఱము ఆడుగుఱ్ఱమైపోయినది. ఇక పెద్దపులియైనకతీ రేమనగా—

కృతయుగమున అకృతవ్రణుడను ముని తీర్థయాత్రలు చేయుచు ఈ చెరువులో దిగెను' అంతలో అతనికాలి నొక మొసలి పట్టినది. అంతనతడు 'ఈ చెరువులో ఏది దిగినను పెద్దపులి యగును' అని శపించెను. అందుచే అది మొదలు ఏజంతు వక్కడ దిగినను పులి యగుచున్నది. అట్లాగుఱ్ఱము పులియగుటతో ఏమియుతోచక కలవరపడి అర్జునుడు శ్రీకృష్ణుని తలంచెను. అంత భగవంతునిదయచే అది మరల యజ్ఞాశ్వముగా మారిపోయినది. అది యథాప్రకారముగా దేశములుతిరుగుచు 'యువతిమండలము' చేరెను.

అక్కడివారందరును స్త్రీలే. వారికి రాణి 'ప్రమీల' యను స్త్రీయే. అందొక్కమగపురుషైనను లేడు. ఎవరైనను మగవాడువచ్చిన వానితో అక్కడున్న స్త్రీలందరును వంతులు వంతులుగా కాపురము చేయుదురు. ఎంతవాడైనను ఒక్క నెలలో చిక్కి చనిపోవును. అక్కడ ఎవరికైనను గర్భము వచ్చినను మగశిశువు పుట్టడు. అందరును ఆడవారే. ఆ దేశములో ప్రవేశించి గుఱ్ఱముమేయుచుండగా స్త్రీసైనికులువచ్చి గుఱ్ఱమును పట్టుకొని వెళ్ళిరి. వారందరును మన్మథుని పరివారమువలె నున్నారు. వా రట్లు గుఱ్ఱమును కొనిపోయి అశ్వశాలలో పెట్టిరి. అర్జునుడు వారితో యుద్ధమునకు సన్న

ద్ధుడయ్యెను. శత్రువులాడువారైనను మగవారైనను యుద్ధము చేయవలసినదేకదా! రెండు సైన్యములను యుద్ధమునకు సిద్ధముకాగానే ప్రమీల అర్జునునితో 'అర్జునా! నీవు నాతో యుద్ధముచేసి, గెలువలేవు. నన్ను వరింపుము. నాతో గూడి సుఖింపుము' అనెను. అర్జును డా మాటలకు 'యువతీ! మీసంగతి నాకు తెలియును. నీతో విహరించినతర్వాత నెవరు బ్రతుకగలరు? నేను నిన్ను వరింపను' అనుటతో ఆమె 'నీవు చచ్చుట ఎట్లయినను ఖాయము. ఊరకయుద్ధములో చచ్చుటకంటె నాతో సుఖించి చనిపోవుట మేలుకదా!' అనెను. ఆమాటల కర్జునునికి పౌరుషమువచ్చినది. నే నంత చేతకాని మగవాడనే! యుద్ధముచేసెదనని ఘోరముగా శరవర్షము కురిపించుచుండెను. ప్రమీల ఆంతకంటె ధైర్యముగా అర్జునుని నొప్పించెను. అంతలో ఆకాశవాణి 'అర్జునా! నీ వెంత శ్రమపడినను ఆమెను గెల్వలేవు. ఆమెను వరింపుము. నీవు నెగ్గుదువు. నీ గుర్రము నీకు వచ్చును' అన్నది. ఆమాటలకు కట్టుపడకున్న తనకు కార్యభంగమని అర్జును డట్లే చేసెను.

అక్కడనుండి గుర్రము వృక్షదేశమునకు వెళ్లెను. అక్కడ చెట్లన్నియు ప్రొద్దునవే మొలిచి సాయంకాల మగుసరికి చచ్చిపోవును. అక్కడివారు చేసిన కర్మానుసారముగా ఒంటికాలు మృగాలు, రెండుకాళ్ళవి, మూడుకాళ్ళవి; ఒక కొమ్మువి, రెండుకొమ్ములవి, మూడుకొమ్ములవి, దీర్ఘశృంగములు అయిన తిర్యగ్జాతులెన్నియో ఉన్నవి, అంతేకాక వికృతాంగులు, వికృతవేషులు అయిన మృగాలు పక్షులు కలి

గినదేశము లెన్నియో దాటిపోయినది. అర్జునుడు వాటి నన్నింటిని చూచుచు దాని వెనుకనే సేనతో వెళ్లెను. అచ్చట నొక మహారణ్యమున్నది. దానిలో భూత, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, మహామారీ ప్రభృతి రాక్షసగణములెన్నో ఉన్నవి. ఘాతుకజంతువు లున్నవి. ఆమధ్యలో దనుజపుర మున్నది. అందు మూడుకోట్లమంది భయంకరులైన రాక్షసులు సేవించుచుండగా భీషణుడను రాక్షసుడు రాజై వారిని పాలించుచుండెను. అతనికి పురోహితుడు మంత్రియునైన బ్రహ్మ రాక్షసు డొక డున్నాడు. అతడు పురోపవన ప్రాంతములో తిరుగుచున్న గుర్రమునుచూచి భీషణునితో 'రాజా! మనమా గుర్రమును పట్టినచో చాలమంది రాజపుత్రులు, సైనికులు వెనువెంటనే వత్తురు. వారందరిని చంపి మనవారిలోని మహా రాక్షసులకు సంతర్పణ చేయవచ్చును. అంతేకాక అర్జునుడు దానికంగరక్షకుడుగా వచ్చుచున్నాడు. అతడుమీ పెదతండ్రి యైన బకాసురుని చంపిన భీమునికి తమ్ముడు. అతనిని చంపి పగసాధింపవచ్చును' అని హితోపదేశముచేయగా భీషణు డా గుర్రమును పట్టించెను.

అంత అర్జునుడుమహోగ్రుడై వారితో యుద్ధమునకు సిద్ధపడెను. అతనికంటెముందుగాఅతనిజెండామీదనున్న ఆంజ నేయులు తోకత్రిప్పి రాక్షసమూకలను పికాపికలు చేయు చుండెను. అతనిపేరుతలపెట్టుసరికి కొందరు, చూచుసరికి కొం దరు, దగ్గరపడుసరికి కొందరు హడలిపోయి పారిపోవుచుండిరి. వారందరికి ధైర్యముచెప్పి భీషణుడు సేనలను సమకూర్చుకొని

యుద్ధరంగమునకు వచ్చెను; భీషణార్జునులకు ఘోరముగా సమరము సాగినది. అందు అర్జునుని బాణములకు భీషణుడు మడిసెను. అప్పుడు గుర్రమునువిడిపించి, భీషణునిపట్టణమందలి విలువైనవస్తువులను చేకొని ముందునకు సాగెను. గుర్రము ముందునకు పోయిపోయి మణిపురసమీపమున కేగినది. అర్జునుడు పట్టణవైభవముచూచి హంసధ్వజునితో 'ఇ దెవ్వరిది? ఎంతో వైభవముగానున్న దే?' అనగానే అతడు 'ఇది నీ సుపుత్రుడైన బభ్రువాహనుడు పరిపాలించు మణిపురము. ఇతడు మహాబలశాలి. నేను మొదలు ఈ ప్రాంతములోని రాజుల మందరము ఇతని కెన్నో కానుక లిచ్చి కైవారములు చేయుచుందుము. అతడు మనగుర్రమును పట్టుకున్న సరిగాని పట్టినచో మనకింక విడిపింపసాధ్యముగాదు' అనెను.

అప్పటికి ప్రొద్దుగ్రుంకవచ్చినది. విహారమునకై వచ్చి సుబుద్ధి యను బభ్రువాహనునిమంత్రి మంచినీరు తాగవచ్చిన గుర్రమును పట్టుకొని మహారాజునకు కానుకచేసెను. అతడు దాని మొగముమీద బంగారుపతకము చదివికొని 'మంత్రీ! మా పెదతండ్రియైనధర్మరాజు అశ్వమేధముచేయుచుండెనట! దానికై యీ గుర్రమును వదలినారట. దీనిని రక్షించుటకు మాతండ్రిగారు వచ్చుచున్నారట. నేడు సుదినము. నా తండ్రిగారి నెప్పుడో చూచితినో, లేదో? ఇప్పటికి చూడగల్గు భాగ్య మబ్బెను. అందుచే పట్టణమంతయు అలంకరింపుడు. సైన్యమునకంతకును విందుఏర్పాటు చేయుడు. విజయునకు కానుకలు సిద్ధపరపుడు' అని ఆజ్ఞాపించెను.

ఈ సన్నాహములతో తెల్లవారినది. విజయుని సేనలు పట్టణమును సమీపించినవి. అంతలో బభ్రువాహనుడుమంత్రి పురోహితులతో కలిసి, కానుకలు పట్టించుకొని, కాలినడకతో అర్జునున కెదురువచ్చెను. అర్జునుని కాళ్ళమీదపడి, 'తండ్రీ! నన్ను మన్నింపుము. కొడుకు తప్పుచేసినను క్షమించుటతల్లి దండ్రులకు సహజము' అని నమస్కరించెను. అంత అర్జునుడు అతనినితిరస్కరించుచు 'నీవును ఒకరాచబిడ్డవేరా! ముందుగా గుర్రముకట్టి యుద్ధచేయుటకుశక్తి లేక కాళ్ళ వేళ్ళసడెదవే! ఛీ! పొమ్మని కాలితో తన్నెను. నీలధ్వజుడు, హంసధ్వజుడు, వృషకేతుడు మొదలైనవారందరు కొడుకును మన్నింపుమనిరి. కాలముదాటుట యెవరితరము! గంగాదేవి యిచ్చిన శాపము తలమీద తన్నుచున్నది. దానితో ఒడలు తెలియక, బభ్రువాహనుని తిట్టుచు మధ్యన 'పిరికిపందా! నీవెవరో కోమటికిపుట్టియుందువు. నా పుత్రుడవైన నీకాపిరికితన మెందుల కొచ్చెను?' అనెను. ఆమాటలతో బభ్రువాహనునికి ఒడలు ఉడికిపోయినవి. తనకు ఎన్నితిట్టినను సహించెనుకాని తల్లిని మాట అనుటతో సహింపలేకపోయినాడు. తండ్రివికదా అని మన్నింపుమంటినిగాని, పిఱికితనముచేగాదు. ఇంక నీతో మాటాడుట అనవసరము. కాచుకొమ్ము. వింటితోనే జవాబిచ్చెదను అని యుద్ధమునకు తలపడెను. తెచ్చినకానుకల నింటికి త్రిప్పివేసెను. అప్పటి అతనిధాటికి అర్జునిసేన లల్లాడిపోయినవి. అతనిదెబ్బకు తట్టుకొనలేకపోయినవి. అనుసాల్వుడు ఓడిపోయినాడు. ప్రద్యుమ్నుడు మూర్ఛపోయినాడు. తక్కిన సేనలలెక్కయేలేదు. అప్పుడు వృషకేతుడు కోపావేశముతో

అతని నెదుర్కొనినాడు. కాని బభ్రువాహనుడుకొద్దిసేపటిలోనే వృషకేతునితల నరకెను. అది అర్జునునికాళ్ళపై వచ్చి పడినది. ఆతడెంతో విచారించినాడు ఇక అర్జునుడే బభ్రువాహనునితో యుద్ధచేయుట కారంభించినాడు. వారిద్దరియుద్ధము సరిగా శ్రీరాముడు కుశుడును పోరినట్లున్నది. భరతాదులవలె ప్రద్యుమ్నాదులు యుద్ధమున వెనుకాడిరి. అటు శ్రీరాముడు ఇటు అర్జునుడు తమకుమారులతో జయేచ్ఛకలిగి యుద్ధము చేయుచుండిరి. బభ్రువాహనుని సైన్యమును అర్జునుడుతుత్తునియలు చేసెను. అర్జునునిసైన్య మిదివరకే చిందరవందరమై పోయినది. ఇకమిగిలినది వారిద్దరే. వారిద్దరును అస్త్రబలము చూపించుకొనుచుండిరి. దైవానుకూల్యములేనప్పుడుఎంతవారైనను జయముపొందలేరు. అర్జునునంతటివానికి దివ్యాస్త్రములు స్ఫురింపలేదు. అస్త్రములు స్ఫురింపనప్పుడు అతడు మాత్ర మేమిచేయగలడు? ఇంతకును శాపబలమట్టిది. బభ్రువాహనుడు తన అమ్ములపొదిలోని జ్వాల బాణమును సంధించికొట్టెను. దాని కిక తిరుగులేదు. ఆమెఅర్జునునకుతలనరుకుటకే బాణమైనది. అది జ్వాలలుక్రక్కుచు అర్జునునిమీదకు వచ్చుచున్నది. అతడెన్నియో అస్త్రములను ప్రయోగించెను. అవన్నియు నిష్ఫలమైనవి. అతడికగతిలేక నారాయణస్మరణ చేయుచుండెను. ఆనాడు కార్తీక శుద్ధఏకాదశి, ఆదివారము ఉత్తరానక్షత్రము. సూర్యాస్తమయ మగుచున్నది. రత్నకుండలకాంతులతో ధగధగలాడుకిరీటశిరము నేలపైవ్రాలినది అది సూర్యుడు నేలపై పడినట్లే యున్నది.

బభ్రువాహనునకు విజయోత్సాహము కలిగినది. తానన్నమాట నెగ్గినదనియేకాని, తండ్రిని చంపితినని తోచ లేదతనికి. ఆయుత్సాహముతోనే అతడు కోటలోనికి వెళ్ళి అంతఃపురమున కేగి తల్లులను చూచెను. అంతకితమే అర్జును డిచ్చటకు వచ్చునని తెలిసికొని ఉలూపి [అర్జునునిభార్య-నాగకన్య] కూడ అచటికి వచ్చియున్నది. చిత్రాంగదయు, ఉలూపియు విచారముతో తలమోదుకొనుచు ఏడువసాగిరి. బభ్రువాహను'డదే'మని అడుగగా 'విధవలమైన మాకు విచారముకాకేమున్నది? నీవుచేసిన నిర్వాహణము తండ్రిని చేతులార చంపుటయేకదా! ఇదా నీపరాక్రమము? నీబలమిందు లకు పనికివచ్చినదా? మాపెంపకము మమ్మేకొట్టినది' అని నోరు నెత్తి మోదుకొనుచు ఏడువసాగిరి. బభ్రువాహనునికి స్ఫూర్తివచ్చినది. 'అమ్మా! నేనుమాత్రము చంపదలచితినా? అతనికి నేనెన్నోరీతుల స్వాగతమును కల్పింపగా అతడునన్ను కాలదన్నుటయేకాక నల్గురిలో మిమ్ముల ననరానిమాట లని నాడు. అవి నేను సహింపలేకపోయితిని. యుద్ధములో రాజులకు బాంధవప్రేమ లుండవు. ఇది రాజధర్మము. నేనేమి చేయను! అగతికమైనది. మీరేమి చేయుమన్నను చేయుదు' నని విలపించెను.

వారందరును కలసి యుద్ధభూమికి వచ్చిరి. అచ్చట వృషకేతుని శిరమును, అర్జునుని తలను ఒడిలోపెట్టుకొని ఎంతో విలపించిరి. అర్జునునితోపాటు సహగమనముచేయుటకు చితి నేర్పాటు చేయుమనిరి. అంత ఉలూపి నాతండ్రివద్ద

మృతసంజీవినీమణి యున్నది. వారిని దండోపాయముచే సాధించుటకు వలనుపడదు. మీరు వెళ్ళి నాపరిస్థితిచెప్పి నామాటగా ఇమ్మన్న యిచ్చును' అన్నది. అప్పటికి వెళ్ళుటకు పుండరీకుడను ఉలూపి భటుడు ప్రయాణమై అతిత్వరితగతినేగి ఆదిశేషునితో జరిగినసంగతి నంతయును వివరించినాడు. అతడు అమృతమును, సంజీవిరత్నమునుకూడా ఇచ్చుటకు సిద్ధమైనాడు. ఇంతలో అక్కడ మంత్రిగానున్న ధృతరాష్ట్రుడను సర్పము 'రాజా! ఇవి మనచేయిదాటిన మరల తిరిగిరావు కాక ఇవిలేవనితెలిసినచో గరుత్మంతు డిక మనల బ్రతుకనిచ్చునా? నీ వూరక చేజార్చవలదు' అని అడ్డుపుల్ల వేసెను. చెడగొట్టుటకు చేతపెయ్యయైనను చాలుగదా! అప్పటిదాక ఇచ్చుటకై తయారైన శేషుడు 'మావారు వలదనుచున్నారు. నేనేమి చెయ్యను?' అనెను చప్పచప్పగా. ధృతరాష్ట్రుడు ఈ మణులులేకపోయినను బాధలేదు. అతనిని శ్రీకృష్ణుడే బ్రతికింపగలడు అని ఊతనిచ్చెను. పుండరీకుడు ఏమియు నలేక వెనుదిరిగి ఖాళీచేతులతో మణిపురమునకు వచ్చెను. అతడు యుద్ధభూమిలోనున్న ఉలూపికడకు వచ్చి 'అమ్మా! ఆదిశేషు డారత్నము నీయ'ననెను. అనుటతోనే బభ్రువాహనుడు కోపోద్రిక్తుడై 'ఏమీ! శేషునకంత పొగరు వచ్చినదే. తన్నిన యిచ్చునుగాని బ్రతిమాలిన యిచ్చునా?' అని తల్లులదగ్గర సెలవుతీసికొని వెంటనే బయలుదేరెను. అతడు వచ్చుటచూచి, శేషుడు తక్కినవారితో 'మీరు నే చెప్పినట్లువినలేదు. ఆడుగో! బభ్రువాహనుడు వచ్చినాడు మీబలము లెంతటివో కనుపరుపుడు అని వారిని యుద్ధము

నకు పంపెను. వారందరు ఆయుధపాణులై గుంపులు గుంపులుగానచ్చి, అతనిని తాకిరి. కాని బభ్రువాహనుడు దివ్యాస్త్రములు ప్రయోగించెను. దానితో వారితలలమీది మణులు చుక్కలు డుల్లినట్లు రాలెను. నాగులు కట్టలు కట్టలుగ క్రింద పడిపోయిరి. అతడు పిపీలికాస్త్రము వేయుటతో లెక్కలేనన్ని చలిచీమలువచ్చి ఆసర్పరాజములను కదలనీయలేదు. బలవంతమైనసర్పములు చలిచీమలచేత చిక్కినవి. హతశేషులు శేషాహికడకు పారిపోయిరి. అతడు వారినిమందలించి, ఛత్రఛామరములు, రత్నములు మొదలైన కానుకలెన్నో పట్టించుకుని, సంజీవినీరత్నమును తాను చేబూని, బభ్రువాహనుని సంతోషపెట్టి, కోపము తగ్గించి, అతనితోపాటు మణిపురమునకు వచ్చెను.

ఇంతలో ధృతరాష్ట్రునకు కసితీరక కొడుకులను పిలిచి మనమాట వినక జీవమణిని శేషుడు పట్టుకొని వెళ్ళినాడు. అయినను మనము అది వారికుపయోగింపనట్లు చేయవలెను అని కుయుక్తి పన్నివా రాదమరపుగా నున్నప్పుడు అర్జునుని తలను తీసికొని, బకదాల్భ్యమహర్షియొక్క ఆశ్రమమునకు పారిపోయెను. ఇంతలో బభ్రువాహనుడు తల్లుల నూరార్చి,తండ్రికళేబరమునకై చూచుసరికి అది కనపడలేదు. ఆప్రదేశమంతయు కలయవెదకిరి. కాని దొరకలేదు. అప్పుడిదేమిరా భగవంతుడా? అని వారు తబ్బిబ్బు లగుచుండిరి.

ఆరాత్రి కుంతీదేవికి పీడకల వచ్చినది. అర్జునుని తల తెగినట్లు, అతడు నూనెగుడ్డలు కట్టుకొని, దక్షిణముగా

వెళ్ళినట్లు కలకన్నది. దానితో ఆమెకు గుండె దడదడ లాడి, భయమేసి, శ్రీకృష్ణునితో తనబాధ తీర్చుమని, తన్నర్జును డున్నచోటికి తీసుకొని వెళ్ళుమని ప్రార్థించెను. అతడు వెంటనే కుంతి, దేవకి, యశోద, భీముడు మొదలైన వారితోసహా గరుత్మంతుని పైనెక్కి మణిపురమునకు వచ్చెను. అచ్చట వారందరును అర్జునుని కళేబరము చూచి, లబలబ లాడిరి. బభ్రువాహనుడు తన తండ్రిని తెప్పింపు మనెను. అప్పుడు కృష్ణుడు దివ్యదృష్టితో చూచి, విషయము తెలిసికొని, 'ఈతని శిరస్సును అపహరింప తలచిన దుర్మార్గునితల పగిలి పోవుగాక! అర్జునునితల యిచ్చటకు వచ్చిపడు గాక!' అనుమాటలతోనే రెండుపనులు నొక్కసారిగా జరిగినవి. మణిప్రభావమువలన, ఆయుద్ధమున చచ్చిన సైనికుల నందరిని బ్రతికించిరి. అర్జునుడును, వృషకేతుడును నిద్రపోయి లేచినట్లు లేచిరి. కృష్ణుడు తమవారికి అక్కడనున్నవారినందరిని ఎరుకపరచెను. బభ్రువాహనుడు తండ్రికి మ్రొక్కెను అంతఆదిశేషువు 'జగత్తునంతను తాను జయించునట్లును, తనను కొడుకు జయించు నట్లును ప్రతిమనుజుడు కోరవలయును. అర్జునా! నీ వదృష్ట వంతుడవు. కనుక కోరకుండకయే నీకట్టి అదృష్టము కల్గినది అని శ్రీకృష్ణునివద్ద సెలవుతీసికొని, అతడు వెడలిపోయెను. అక్కడ రెండురోజులు విశ్రమించిన తర్వాత శ్రీకృష్ణుడు హస్తినాపురమునుండి వచ్చినవారినందరిని తిరిగియింటికి పంపి వేసెను. ఈసంజీవమణికథను చదివినవారికి అపమృత్యు భయము లేకుండునట్లు వరమిచ్చెను. అర్జునునితో కలిసి అశ్వముచెంట బయలుదేరెను.

ఆ గుఱ్ఱము అట్లు నానాదేశములు తిరుగుచు రత్నపురము చేరినది. దానిని మయూరధ్వజుడు పాలించుచుండెను. అతని కొడుకు తామ్రధ్వజుడు. మంత్రి నకులధ్వజుడు మహారాజు అశ్వమేధమును చేయదలచి గుఱ్ఱమును వదలెను. దానికి రక్షకుడుగా తామ్రధ్వజుడు బయలుదేరినాడు. ఊరి వెలుపలనే రెండుగుఱ్ఱములును కలసికొన్నవి; రెండును పోతరించినవే. ఒకదానినొకటి ఢీకొన్నవి; కలియ బడినవి. యుద్ధమారంభించినవి. ఎవరిదన్న వారి కభిమానము. తామ్రధ్వజుడు రెండవగుఱ్ఱమును పట్టుకొని ముఖముమీది పత్రమునుచూచెను. 'నాతండ్రి కొక్కసారిగ రెండశ్వమేధముల ఫల మబ్బు'నని దానినిపట్టి, కట్టించెను. 'ఇంతేకాక భారతసమరములో నర, నారాయణులు, కర్ణుడే వీరులని సురముని చెప్పినాడు. అందు నరనారాయణులు వచ్చుచున్నారట! బభ్రువాహనుడు నిన్నమొన్నటిదాక మాకుకప్పము కట్టువీరుడు. సేనాపతిగా నున్నాడు. ఇంతకంటె మొనగాళ్ళు ఈసేనలో లేనట్లున్నారు' అనుచు ధైర్యముతో అర్ధచంద్రాకారముగ వ్యూహము పన్నెను.

ఇదంతయుచూచి, శ్రీకృష్ణుడు తాను సేనానాయకుడుగ అర్జునసైన్యమును గృధ్రవ్యూహమును పన్నెను. ఉభయపక్షములవారు తలపడిరి. అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు, వృషకేతుడు మొదలైన రాకుమారులు సేనాముఖమున కురికి మూర్ఛిల్లిరి. అర్జునుడు తామ్రకేతునితో యుద్ధముచేసి మూర్ఛపోయెను. శ్రీకృష్ణుడును చక్రము చేబూని, తామ్ర

ధ్వజు నెదుర్కొనెను. అంత నతడు శరవర్షము కురిపించి, కృష్ణుని మూర్ఛపొందించెను. తామ్రధ్వజుడిట్లు యుద్ధములో విజయముపొంది, గుఱ్ఱమును పట్టించుకొని తండ్రికడకు వెళ్ళు సరికి, అతడు కను లెఱ్ఱజేసికొని, ఇవా నీ తెలివి తేటలు! శ్రీకృష్ణుని జయించి, గుఱ్ఱమును తెచ్చినావు. ఇక నే నెవరిని గూర్చి యజ్ఞముచేయుదును? అని కొడుకును మందలించి, విచారపడుచుండెను

అంతలో ప్రొద్దుగ్రుంకినది. కృష్ణార్జునులు మూర్ఛ దేరిరి. వారికి తామ్రధ్వజుని జయించి గుఱ్ఱమును తీసికొని వచ్చుట సాధ్యముకానిపనియని ఇప్పటికి తోచినది. ఇద్దరును కలిసి ఉపాయమాలోచించినారు. చక్కగా బిళ్ళమడతపంచె కట్టుకట్టి, మొగమున విభూతి పూసికొని, రుద్రాక్షపేర్లు మెడలో వేసికొని, శ్రీకృష్ణుడు గురువుగాను, అర్జునుడు విద్యార్థిగాను తయారైరి. మెల్లగా కోటలోనికి ప్రవేశించిరి.

అంద నామహారాజు ఎదురుగా వచ్చెను. అంతలో వారు 'భద్ర మస్తు' అని దీవించిరి. రాజు విద్వాంసులారా! నేను నమస్కరింపకయే నన్ను దీవించుట శపించుటవంటిది కదా! అనగా వారు మేము కార్యార్థులమై వచ్చితిమి. అందుచే ముందుగా దీవింపవచ్చును. దోషము లేదు అనిరి. దానికి సంతోషించి, రాజు నమస్కరించి వారి నుచితాసనములపై కూర్చుండబెట్టి 'వచ్చినపని చెప్పుడు. తప్పక తీర్తు' ననెను. అప్పుడు కృష్ణుడు మహారాజా! నాది ధర్మపురి. నా పేరుకృష్ణశర్మ. నాకొడుకునకు పెండ్లికై సుశీలు

నింటివద్ద కన్యయున్నదని మాపురోహితుడు చెప్పగా మేము వచ్చుచుంటిమి. దారిలో పెద్ద అడవి అడ్డయినది. మేమెంత భయపడుచుంటిమో అట్లే దారిలో పేరాకలితోనున్న సింహము వచ్చి నాకొడుకెక్కిన గుఱ్ఱమును పట్టుకొన్నది. అప్పుడు నేను అటవ్యాం నరసింహః పాతు [అడవిలో నరసింహమూర్తి రక్షించుగాక] అని నూటయెనిమిదిసార్లు జపించగా ఆసింహము గర్జించుచు మనుష్యవాక్కులతో నాతో నానోటపడినతర్వాత యముడువచ్చుగాక పోవుటకు వీలు లేదు. అనవసర ప్రయత్నము కట్టిపెట్టి నీవు నీశిష్యుడును పొండు అన్నది.

నా కేమియు తోచలేదు. ఒడలు కంపించుచున్నది. మృగరాజా! నేను ముసలివాడను. ఈవయస్సులో నాఏక పుత్రుని చంపవలదు. నన్ను మ్రింగుమంటిని. దాని కది నీవు నన్ను తృప్తినందింపలేవు. మయూరధ్వజుని శరణువేడుము. అతనివలన కార్యసాధన అగు నన్నది. నీవు తప్పకచేసెద నన్న చెప్పెద ననెను. రాజు నరహరిమూర్తిగాక మరియొక సింహము నాదేశపుటడవులలో తిరుగునా? ఏ మడిగినను ఇచ్చెద. జంకులేక అడుగుము అనుటతో అది నీ శరీరములో సగము అందులోను కుడిభాగము, నీభార్య పుత్రుడు కోసి యిచ్చిన పుచ్చుకొందు నన్నది. అట్లిచ్చిన నాకొడుకు బ్రతుకును. అని ప్రార్థించెను. మయూరధ్వజు డానందముతో భార్యయైన కుముద్వతిని కొడుకును పిలిచి తన నిశ్చయము చెప్పి వారిని కోయుమనెను. వారు మేమే మాశరీరములను

నర్పణచేసి ధన్యులమయ్యెద మనిరి. కాని బ్రాహ్మణు డంగీకరింపలేదు. అది సింహముకోరిక కాదుకదా! తామ్రధ్వజుడు కోయుటకు జంకగా తల్లి మందలించినది. ఇద్దరును కోయుచుండిరి. అంత ఎడమకంటి నీరుకారజొచ్చినది. అది చూచి కృష్ణశర్మ 'నీ వేడ్చుచున్నావు ఈమాంసము వలదు' అని లేచిపోబోయెను. కుముద్వతి 'మీ రెవరో మాయబ్రాహ్మణులవలె నున్నారు. ఇంతవరకు వచ్చి కోయుచున్న తర్వాత అక్కరలేదనునా?' అనెను. కాని మహారాజు వారిని వెనుకకు పిలిచి ధీరోత్తమా! కుడిభాగమే సద్వినియోగ మగుచున్నది. నేనగుటలేదే? అని ఎడమకన్నేడ్చుచున్నది. అంతే కాని, నేనే యేడ్చిన రెండుకళ్ళవెంబడిని నీరు వచ్చును గదా!' అనెను.

ఆతని ధైర్యమునకు, దాతృత్వమునకును సంతసించి శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై 'రాజా! నీయట్టి ధైర్యశాలి పృధివిలో లేదు. నీకొడుకు మమ్మలనిద్దరిని గెల్చెను. నీవు శరీరము కోసియిచ్చుచున్నావు. వీర వితరణములలో మీకు సాటి యెవరు వత్తురు? ధన్యుడవు అని తలనిమురగా అది మామూలుగా అతుకుకొనిపోయెను. అంత మయూరధ్వజుడు మహానందముతో దేవా! నాకొడుకు నిధినిమించివేసి కుండ తెచ్చినట్లు నిన్ను గెల్చితినని గుఱ్ఱమును తెచ్చినాడు. నీ విలాసముగాని నిన్ను గెలువగల్గినవీరు డెవ్వడు? ఇదంతయు నీకృప. నా అదృష్టము పండి నీవు నా కన్నుల కగపడినావు అని పొగడి అర్జునుని మూర్కొని వారిద్దరికి నెంతో మర్యాదలు చేసి

విందులు చేసెను. అర్జునునికి మయూరధ్వజుని భక్తి తాత్పర్యములను చూపుటకై కృష్ణు డీపన్నాగము పన్నినాడు. దానితో 'నేనే మహాభక్తుడను' అను గర్వము అర్జునునికి తగ్గినది. అచ్చట మూడురోజు లుండి వారశ్వమేధ హయము కదలించిరి. మయూరధ్వజుడును అతని అశ్వమునకు రక్షకుడుగా బయలు దేరెను.

అవి సారస్వతపురము చేరినవి. దానికి రాజు వీరవర్మ. అతనికి యముడు ఇల్లటపు టల్లుడై యుండెను. అతడు మహా బలశాలి యగుటచే అశ్వముల రెంటిని పట్టించెను. అతని సుతులు సులోలుడు, కువలుడు, సులలుడు, అనువారలు రథారూఢులై యుద్ధమునకువచ్చిరి. రెండు సేనలవారికి ఘోరముగా పోరు జరుగుచుండెను. అందు యముడు సకలసేనల నుగ్గాడుచుండగా అర్జును డిదేమి? ఇతడు మానవుడు లాగున లేడే? అనుటతో కృష్ణుడు కాడు, ఇతడు యముడు. ఇతని అల్లుడు అనెను. అర్జునుడు అట్లా? యముడా? అల్లు డెట్లయ్యెను? అనగా అతడు వీరవర్మకు సుమాలిని యను కూతురున్నది. ఆమెకు వివాహయుక్తవయసు రాగానే తండ్రి ఎవరిని పెండ్లాడుదు వనగా ఆమె ప్రతిమనుజునికిని చావువలన భయముతప్పదు. పెండ్లిచేసికొని వానితో సహగమనము చేయుటకంటె యమునినే పెండ్లాడదలచితిని అన్నది. అతడు యముడు నిన్ను వరించి పెండ్లాడిన నాఅభ్యంతర మేమున్నదనెను. నారదమహర్షి ఈవార్తను యమునకు చేరవేయగా అతడు తాను పెండ్లికి తరలివచ్చుచుంటి నని కబురు పంపెను.

వీరవర్మ, కూతురును మహానందముతో సిద్ధముగా నున్నారు. యముని వెంట రోగదేవతలందరు రాబోయి అక్కడ ధర్మాత్ము లుందురు. ఎట్లు పోవుట? అని భయపడగా యముడు మీ కేమియు భయమువలదు. పాపులకు భయంకరముగాను, పుణ్యమూర్తులకు సాధుగాను కన్పడుదురు. కాన నా వెంట రండు. అని వారినందరిని తోడ్కొనివచ్చి మహా వైభవముగా వివాహము చేసికొనెను. తరువాత మామగారిని మీ కేమి కావలెనో కోరుకొమ్మనగా అతడు నాకు మరొక వర మక్కర లేదు. ప్రాణావసమయమున శ్రీకృష్ణుని దర్శన మగునట్లు చేయుమని కోరెను. అత డట్లే కోరికతీర్చదలచి అది తీర్చువరకు నక్కడనే యున్నవాడు అందుచే నితని కెదురెవ్వరు? అని చెప్పి యుద్ధము చేయజొచ్చిరి.

అంత వీరవర్మ కృష్ణుని, అర్జునుని చంకలో ఇరికించుకొని, అర్జుని ధ్వజాధి దేవతయైన ఆంజనేయుని రెండు గ్రుద్దులు గ్రుద్దెను. దానితో అతడు కన్నులు తేలవేసెను. అప్పుడు ఇది కాదని వీరవర్మను రెండుతాపులు తలమీద తన్నెను. అంత వీరవర్మ మహానుభావా! నేటితో నాపాపములు నశించినవి. నీపాదములు నాశిరము నంటినవి. ఇంకేమి కావలెను? రక్షింపుము. నీతోడ పోరుసేయ నే నెంతవాడను? అని విల్లుడించి అతనికి సాష్టాంగ ప్రణామము చేసెను. అప్పుడు కృష్ణుని అతనిసేనలును వీరవర్మ ఇంటిలో అయిదురోజులు విందుచేసిరి.

అంతట ఆ గుర్రములు అక్కడ ఉన్న నదిని దాటి అవతల గట్టునకు వెళ్ళినవి. ఆ అశ్వరక్షకులు గుర్రములను కానక, తబ్బిబ్బులు పడుచుండిరి. ఇంతలో నారదమహర్షి అక్కడకువచ్చెను. వారందరు అతనికినమస్కరించిరి. అర్జునుడు మహాత్మా! మా గుర్రము లెటుపోయినవో సెలవిండు అనెను. అంత నారదుడు అవి చంద్రహాసుడు పరిపాలించు కుంతలదేశమును చేరినవి. అతడు చాల పరాక్రమవంతుడు. ఈరాజులెల్లరును అతనికి సరిరారు. అతని చరిత్ర చాలచిత్ర మైనది, కాని వినుట కిది వేళ కాదు. గుర్రములు మరింత దూరము వెళ్ళిపోవును. అనుటతో అర్జునుడు అయిననుసరే, ఆ పుణ్యచరిత్ర వినిపింపుడు అనెను. నారదు డిట్లని చెప్ప దొడగెను.

కేరళ రాజునకు మూలానక్షత్రమున ఒక కొడుకు పుట్టెను; ఆనక్షత్ర గండదోషమువలన కొద్దిరోజులలో తండ్రి చనిపోయెను. తల్లి ఆ బాలుని దాదుల కొప్పగించి, మగనితో సహగమనము చేసెను. వారు కుంతలదేశమున కా బాలుని తీసికొనివచ్చి, మూడేండ్లు పెంచి చనిపోయిరి. అంత నా యూరిలోని ఇరుగమ్మ, పొరుగమ్మలే అతనికి వేళ కింతముద్దపెట్టి పెంచుచుండిరి; అంత నొకనా డతడు దుష్టబుద్ధి యను మంత్రియింటికి వెళ్లెను. అతని కొలువులో నున్న మహర్షులు, ఈ బాలునిచూచి, ఈముద్దుబిడ్డడు ఎవరి సుపుత్రుడో కాని, సకలభూమండలమును ఏలగల అదృష్ట శాలి అనిరి. అది వినియు విననట్లు మంత్రి ఆ బాలుని పంపి

వేసి 'మహాత్ముల వాక్యము లెట్లును కాకపోవు. అయినను ఇతని బ్రతుకనిచ్చినకదా! ఇతడు రాజ్యమేలుట?' అనితలచి చండాలురను రహస్యముగా పిలచి ఆబాలుని అడవిలోనికి తీసికొనిపోయి చంపుమని ఆజ్ఞనిచ్చెను. ఆబాలు డసలే దిక్కు లేనివాడు. ఆపై మంత్రి చంపదలచెను. ఇంక రక్షించువా రెవ్వరు? అనాయాసముగా వారతని నొకఘోరారణ్యమునకు తీసికొనివెళ్ళిరి. అక్కడ అతనిని చంపబోవుచరి కతడు పూర్వ జన్మసంస్కారమువలన శ్రీవిష్ణుధ్యానము చేసెను. దానితో వారి కతని చంపుటకు మనస్సొప్పక కాలిబ్రవేలు తెగగొట్టి తీసికొనివెళ్ళి మంత్రికి చూపి పనిచక్క బెట్టితిమని బహు మతుల నందిరి. మంత్రిమనసు కుదుటబడెను. అతని కంత దుగ్ధ ఎందులకో? అంత శాబరదేశరాజైన పుళిందుడు ఆఅడ వికి వేటకు వచ్చి, వ్రేలు తెగుటచే బాధపడుచు, శ్రీహరిని తలచుచున్న ఆ అయిదేండ్లబాలుని చూచి, తనకు సంతానము లేనందున ఆబాలుని భగవంతుడే తనకు ప్రసాదించెనని సం తోషించుచు, అతనిని బుజ్జగించి, ఇంటికి తీసికొని వెళ్ళెను. అతని రాజధాని యగు చందనావతి పట్టణములోని వారం దరు సంతోషించిరి. ఇతడు రాణియైన మేధావినికి ఆబాలు నిచ్చిచంద్రునివంటివాడు కానం చంద్రహాసు డని పేరు పెట్టెను. ఆకుమారవాడు దినదిన ప్రవర్ధమానుడై, తల్లిదండ్రుల కానందము చేకూర్చుచుండెను. ఆబాలుడు వచ్చినది మొదలు ఆదేశము సుభిక్షముగా నుండెను. పుళిందకు డతనికి ఉపనయ నముచేసి, అన్నివిద్యలు నేర్పించెను. అతడు గురువులకే విద్యనేర్పునంతటి ధీశాలి. పదారేండ్ల నూనూగుమీసాల

ప్రాయమున తండ్రియనుమతిపై అతడు దిగ్విజయముచేసి, గజాశ్వ రథ కనకాదులైన కానుకల నెన్నిటినో తెచ్చి ఇల్లుచేరెను.

అంత పుళిందకుడు కుంతలదేశపురాజు తమకు చక్రవర్తియైనందున అతనికి దుష్టబుద్ధికి, పురోహితుడైన గాలవునికి కానుకల నంపెను. చంద్రహాసుడు వాటినన్నిటిని తండ్రి చెప్పినట్లిచ్చుటతో కప్పమైనను కట్టలేని పుళిందకున కింతధనము ఎట్లువచ్చెనా? అని దుష్టబుద్ధి పుళిందకుని పట్టి తీసికొనివత్తునని రాజును ఒప్పించి, చంద్రహాసునివెంట చందనావతికి వచ్చెను. పుళిందకు డాతని కెంతోమర్యాద చేసెను. దుష్టబుద్ధి వికటముగా నవ్వుచు, రాజా! ఈకుఱ్ఱవాడు చక్రవర్తి లక్షణసంపన్నుడు. ఇతడు నీకెట్లు కల్గెను? అనుటతో అత డాబాలుడు దొరికినరీతిని చెప్పెను. అది వినుటతో దుష్టబుద్ధికి తానిదివరకు పన్నిన పన్నాగము కొనసాగలేదని మనస్సునకు తట్టినది. అతని నెట్లైన హత మార్చదలచెను. కాని ఇచ్చట తానేమనుకొన్నను సాగదు సరికదా తనకే ప్రాణముమీదికి వచ్చును. అందుచే తన కొడుకుపేర నొకలేఖవ్రాసి చంద్రహాసునితో 'నాయనా! నీ వొక్కడవే అతిత్వరితముగా మాయూరికి వెళ్లి ఈ లేఖ నాకొడుకున కిమ్ము' అని దానిపై ముద్రవేసి, అతనికిచ్చి పంపెను. చంద్రహాసున కీ కుతంత్రమేమియు తెలియదు. అతడు త్వరితగతిని వెళ్ళుచుండెను.

అంత దారిలో మార్గాయాసముపోవుటకై కుంతల పట్టణపు పురోద్యానముననున్న చెరువులో గుఱ్ఱమునకు నీరు పెట్టి, చెట్టునకు కట్టి, తానుకూడ మంచినీరు త్రాగి, చెట్టు నీడను పరుండెను. బడలికమీద అతనికి నిద్రవచ్చినది. అంత కుంతలరాజుకూతురు చంపకమాలినియు, దుష్టబుద్ధి కూతురు విషయ యును ఆవనమునకు విహరింపవచ్చిరి. వా రందందు విహరించుచుండగా విషయ నిద్రించుచున్న చంద్ర హాసుని చూచెను. ఆమెకు అతనిపై ప్రేమకలిగినది. అతనిని పరికించి చూచుచు, దగ్గరలో సంచిలోనున్న, తనతండ్రి ముద్రయున్న లేఖనుతీసి చూచుసరికి ఆమెకు తండ్రి కుతంత్ర మునకు కోపమువచ్చినది. ఆపత్రికలోనున్న 'విషము నిమ్ము' అను పదమును 'విషయ నిమ్ము' అను పదముగా మార్చి, మెల్లగా ఆముద్ర నక్లే అంటించి తాను వెళ్ళిపోయెను.

కొంత సేపటికి చంద్రహాసుడు మేల్కాంచి, ప్రొద్దు పోయినదని చురుకుగా మంత్రియింటికి వెళ్లెను. అచట ద్వారపాలకులద్వారా మంత్రికొడుకైన మదనునికి తండ్రి యిచ్చినలేఖనిచ్చెను. అతడు దానిని చూచుకొని చంద్ర హాసునకు తనచెల్లెలి నిచ్చునంతటి అదృష్ట మబ్బినందులకు సంతోషించుచు ఆ రాత్రియే మహోత్సవముగా పెండ్లి చేసెను.

అచ్చట దుష్టబుద్ధి తనయెత్తు పారినందులకు మనమున నుల్లసిల్లుచు, పుళిందకుని బంధించి, ఇంటికి వచ్చుచుండెను. దారిలో నొకక్రూరసర్ప మతని కెదురై, మనుష్యవాక్కు-

లతో మంత్రీ! నే నిన్నాళ్ళు నీయింటిలోని నిధి నిక్షేపము లను ప్రాణమువలె కాచినాను. నాసమయము సరిపోయినది. వెడలిపోవుచున్నాననని వెళ్లిపోయెను. అతడా మాటలుపట్టించుకొనలేదు. కాని పట్టణము చేరుసరికి తనకూతురు పెళ్లి మాటవిని, తానొకటి చెప్పిన కొడుకు మరొకటి చేసినందుకు మండిపడుచు, మదనుని పిలిచి అడుగగా, అతడు తండ్రి వ్రాసిన లేఖను చూపెను. దానిలో మార్పు నాతడు గమనించలేక పోయెను. తన లోపలనున్న బాధనెవ్వరికి తెలుపక, నవ్వుచు లోనికేగెను. అంతలో నూతన వధూవరులువచ్చి నమస్కరింపగా వారిని దీవించెను. కూతురింటిలోనికి వెళ్ళిపోయినది. అంతట అల్లునితో నాయనా! ఈరోజు సాయంకాలము ఊరివెలుపలనున్న కాళికాదేవి గుడికి నీ వొంటరిగా వెళ్ళి, పూజించి రమ్మని. ఇది మాకుటుంబాచారము అనిచెప్పెను. చంద్రహాసు డందుల కంగీకరించెను.

అంత కుంతలరాజున కరిష్టసూచనలు కనుపడగా పురోహితుడైన గాలవుని పిలిచి ఫలిత మడిగెను. అతడు మహారాజున కవసానకాలము సమీపించినదని చెప్పెను. దానితో అతడు మదనునిపిలిచి చంద్రహాసుని రమ్మని చెప్పుమనెను. మదను డింటికి వచ్చుసరికి సాయంకాలమైనది, అప్పుడు చంద్రహాసుడు దుష్టబుద్ధిచెప్పినట్లు కాళికాలయమునకు పోవుటకై సంభారములు తీసికొనెను. మదనుడాతనికి రాజాజ్ఞను తెలిపి తానాతనికి బదులు కాళీపూజ చేసివత్తునని గుడికి వెళ్లెను.

అంత లోపలదుష్టబుద్ధి బ్రహ్మాఘ్నుడు, గోఘ్నుడు మొదలైన పంద్రెండుగురు చండాలుర రావించి రహస్యమున కాళీదేవి గుడికి సాయంకాలమున ఒంటరిగా వచ్చినయతనిని అనుమానించక చంపివేయుడని యాజ్ఞనిచ్చెను. వారట్లేవెళ్ళి దాగియుండిరి. మదనుడు వచ్చుటతోడనే వారు వెలికివచ్చి చంపివేసిరి. చంద్రహాసుడు రాజుగారింటికి వెళ్ళుటతో మహారాజు చంపకమాలిని నిచ్చి పెండ్లి చేసి రాజ్యము సరణముగా నిచ్చి తాను తపోవనమునకేగెను. అంత చంద్రహాసుడు తెల్లయేనుగునెక్కి మంత్రియింటికి వచ్చెను. అతనినిచూచుటతో మంత్రికి పైప్రాణములు పైకిపోయినవి. తన రహస్యమెక్కడ బయటపడెనో? అని అతనిభయము. కాని చంద్రహాసుడు జరిగిన కథనంతయు చెప్పుటతో మరింత విచారపడి, తన విచారమును పైకిచెప్పక అతని నింటిలోనికంపి, తాను కాళీదేవిగుడికి పరుగెత్తుకొని వెళ్లెను. ఇతడు వెళ్లుసరికక్కడ అంతయు జరిగిపోయినది. తన యేకైక పుత్రుడు చనిపోవుటతో అతనికి గుండె బ్రద్దలైనది. తన చేతులార తానే చంపించినాడు. ఇష్టములేనివాని తిట్టిన ఇష్టమున్నచోట తగులునన్నదిదే. మంత్రి తలపగులగొట్టుకొని చనిపోయెను.

తెల్లవారుసరికి పూజారి ఇదంతయుచూచి ఎందుకట్లు జరిగెనో తెలిసికొనలేక చంద్రహాసునికి నివేదించెను. అతనికి నిజము తెలియదు. అయినను సహజముగ దయాపరుడైనందున అక్కడ దేవినిగూర్చి హోమములు చేయించెను. చండిక

ప్రత్యక్షమైనది. ఏమికావలెనో కోరుకొమ్మన్నది. అతడు దుష్టబుద్ధిని, కుమారుని బ్రతికింపుము; నాకు విష్ణుభక్తి హెచ్చునట్లు చేయుమని కోరెను. దేవి అట్లే ప్రసాదించినది. మంత్రి, సుతులు నిద్రమేల్కాంచినట్లు లేచి చంద్రహాసునికి కృతజ్ఞతను తెల్పిరి. దుష్టబుద్ధి తన తప్పును చెప్పి సుబుద్ధి అయ్యెను. పేరుమాత్రము మారలేదు. అందరు నింటికి వచ్చి సుఖముగానుండిరి. చంద్రహాసునికి చంపకమాలికినిపద్మాక్షుడు, విషయకు మకరధ్వజుడు అను పుత్రులు పుట్టిరి. అతడు మూడువందలయేండ్లు రాజ్యముచేసి ఇప్పుడు కుమారులకొప్ప చెప్పినాడు. అని నారదుడు చంద్రహాసుని వృత్తాంత మెరిగించి గుఱ్ఱము లాతని దేశమునకు వెళ్ళినవని చెప్పెను.

కృష్ణార్జునులు సైన్యముతో అచ్చటికేగిరి. ఇంతలో పద్మాక్షాదులు యజ్ఞాశ్వముల పట్టుకొని తండ్రికి చెప్పగా అతడు అది ధర్మరాజు వదలినది. ఎందుకు పట్టినారు. పోనిండు. వారు వచ్చిన సరేసరి. లేదా అప్పటికి మనమే దీనిని ధర్మరాజున కప్పగింతమనెను. అంతలో అర్జునాదు లటకు చేరిరి. వారు వచ్చిరని వినగానే చంద్రహాసుడు కానుకలు పుచ్చుకొని వారి కెదురువచ్చి శ్రీకృష్ణునికి సాష్టాంగ నమస్కారముచేసెను. అర్జును డాతనికి నమస్కరించినాడు. శ్రీకృష్ణాదులు చంద్రహాసుని నగరమున మూడురోజు లుండిరి.

అంత నా గుఱ్ఱములు సముద్రములోనికి దూకినవి. శ్రీకృష్ణార్జునాదులు సముద్రములోనికి వాటితోపాటు వెళ్ళగా అక్కడ బకదాల్భ్యుని ఆశ్రమ మగుపడినది. అక్కడ బకదాల్భ్యుని చూచి అర్జును డాశ్చర్యపోయెను. అతని యొంటిపై నెన్నో పుట్టలు లేచినవి. అది శుష్కించి శుష్కించియున్నను బ్రహ్మ తేజస్సుతో విరాజిల్లుచుండెను. అంత నర్జునుడు 'మహాత్మా! ఈ మఱ్ఱాకు నీడ నెట్లు కాలక్షేపము చేయుచున్నారు?' అనగా ఆ ముని 'బ్రహ్మచర్యములో తపస్సు చేయుచుండు నాకిది చాలదా? నే నెరిగినతర్వాత ఇరువది మంది బ్రహ్మలు పాలనచేసి గతించినారు. ఎన్నోసార్లు ప్రళయములు వచ్చినవి. జగత్తంతయు జలమయమైనప్పుడీ మఱ్ఱియాకుమీదనే శ్రీమన్నారాయణమూర్తి బాలావతారమున నుండును. ఆ స్వామియే ఈ శ్రీకృష్ణుడు. నీ అదృష్టమున నిన్ను కాపాడుచున్నాడు' అని కృష్ణునకు వందనము చేసెను. అతడు చూచినవారిలో చతుర్ముఖ, షణ్ముఖ, అష్టముఖ, ద్వాదశముఖ, శతముఖ, సహస్రముఖ, బ్రహ్మలున్నారనియు, అందా సహస్రముఖుడే విరాడ్రూపియనియు చెప్పి యర్జునునికి వేదాంత ముపదేశించెను.

తరువాత గుఱ్ఱములతోలుకొని వారు సైంధవుని దేశమునకు బయలుదేరిరి. అర్జునుడు వచ్చుచుండెనని తెలిసి సైంధవుని కొమారుడు గుండెబ్రద్దలయి చనిపోయెను. దుశ్శల

వానిపైబడి ఏడువసాగినది. అంతలో శ్రీకృష్ణుడురాగానే నేనిట్లనాథనై కొడుకునుకూడ పోగొట్టుకొన్నాను. రక్షింపు మని పాదములపైబడినది. ఆతడా మెకుమారుని చేతులలో నిమిరెను. అంత నతడు లేచి వారికి నమస్కరించెను అటనుండి వారినందరిని వెనుకకురమ్మని శ్రీకృష్ణుడు ముందుగా హస్తినా పట్టణమున కేగి దిగ్విజయవార్త జెప్పెను అప్పుడు ధర్మరాజు అర్జునాదులకు స్వాగతమిచ్చుటకు తగువారి నియోగించెను. పౌరస్త్రీలెల్లరు వారికిలాజలు, అక్షతలు చల్లినీరాజనము లిచ్చిరి.

అశ్వమేధమున కెందరో రాజులువచ్చిరి. దేవతలు మునులును వచ్చిరి. వ్యాసమహర్షి యాజకుడై క్రతువుచేయించుచుండెను. శ్రీకృష్ణుడు పర్యవేక్షకుడై లోపమురాకుండ చూచుచుండెను. అంతలో యూపమునకు కట్టిన గుర్రము సకిలింపగా అశ్వహృదయవేదియైన నకులుడు యజ్ఞఫల కర్తభోక్తయైన శ్రీకృష్ణుడు సాక్షాత్తు రక్షించుచుండ నాకీ యదృష్టమబ్బెనని అది యబ్బుచున్నది. అని చెప్పెను. అంత భీముడు దాని నాలభించగా దాని నుండి ఒక దివ్యతేజస్సు కృష్ణునిలో కలిసిపోయెను. అందరును ఆశ్చర్యపోయిరి. క్రతువు యథావిధిగా పూర్తియైనది. అందరికిని బంగారు పాత్రలలో షడ్రసోపేతముగా భోజనాది సత్కారములుజరిగినవి. దక్షిణలు కల్పోక్తముకంటె ద్విగుణముగా నిచ్చెను. అంద

రును మహానందముతో నిండ్లు చేరిరి. ధర్మరాజెంజయో ధర్మయుక్తముగా పుడమినేలెను. శ్రీకృష్ణుడు వారిని కంటిని రెప్పవలె కాపాడెను. అతని రాజ్యమున ప్రజలెల్ల సుఖించిరి.

ఈ కథను చదివినవారికి విన్నవారికి శ్రీకృష్ణ ప్రసాదమున నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి కల్గునుగాక! నానాయాగ దానాదిపుణ్యము లబ్బునుగాత!

ఇది జైమిని భారతమందలి యశ్వమేధ పర్వకథ.

శ్రీకృష్ణార్పణమస్తు సదా.

Vuma Printers, Main Bazaar, VIJAYAWADA-1.